# విషయసూచిక

## చిత్రములు



పిసరాగిలక్కలు

చిత్రకారుడు: శ్రీ చేవలవాడ యస్. కృష్ణయ్యగారు, శ్రీ ఆంధ్రజాతీయకళాశాల, బందరు




చెన్నపట్టణము, నవంబరు ౧౯౨౯

సంపుటము ౬ శుక్ల సంవత్సరము కార్తికమాసము సంఖ్య ౧౧


## కొండవీటి పొగమబ్బులు


విశ్వనాథ సత్యనారాయణ గారు


[1929 సం. అక్టోబరు, 1, 2, 3 తారీఖులలో మా హిందూకళాశాలోపాధ్యాయులలో కొందఱమును, మఱి కొందఱు విద్యార్థులును, మా ప్రిన్సిపాలుగారితో సహా కొండవీటి కొండలమీద కాలక్షేపము చేసితిమి. కొండలమీద ప్రాలి పోవుమబ్బులు చూచుటకు సుందరములు. అందులో కొండవీటిమబ్బులు సుందరాతిసుందరములు.

కొండవీడే రుక్మిణీదేవి పుట్టిల్లు కుండిన యని కొందఱు.

కొండవీడు తొలుత గజపతులు, తరువాత రెడ్లు, మరల గజపతులు, తరువాత శ్రీకృష్ణరాయలవారు, మఱి పై మహమ్మదీయులు ఏలినవీడు. ఎంత ఏలినా కొండవీడు తెలుగు మనస్సులకు రెడ్లదే అనిపించును.

అవచితిప్పయ ద్వీపాంతరములతో రత్నాలు, అగరు, కస్తూరి, జవాజి మొదలయిన దివ్యద్రవ్యముల వర్తకము నెఱపిన మహాధని. అతడు రెడ్డిరాజ్యమునకు పెట్టుబడిదారు.]

దగ్ధాంధ్రరాజ్య నిత్యవిషాద ధూమమ్ము వలెఁ గొండబురుజుల కెలన లేచి
బురుజుకొమ్ముల వీడిపోలేని రెడ్లకీర్తిపోలెఁ జెమురాళ్ల పతంకులుపడి
రెడ్లకందా వెన్కఁ రేఁగు వంటింటి పెన్పొగవోలె గుములై ముందు సాగి
ప్రాగ్భవదాంధ్ర స్వతంత్రతారమువోలెఁ గొండ లంటీ యంటకుండఁ బోయి

శ్యామలీభవద్గ్రావభూసాదనార్థ - మొలయు వెల్లావుల కదంబములుగ నిలిచి
కొండకొమ్ములు లోఁ దాఁచుకొన్న క్రొత్త - క్రొత్త పొగమబ్బు లలమె నీ కొండకొనల.

ఒక రెడ్డినభ తీర్చియున్న కొండకు వాలుకొనలతో ముత్యాల గొడుగు పట్టు
ఒక రెడ్డిమూర్తి పోలిక తీరియున్న కొండకు కొనగా కిరీటమ్ము పెట్టు
ఒక్కయంతఃపురవధూశ్రేణిఁ జను బురుజున నన్నమేలిముసుంగు తొడుగు
ఒక తెల్గుబంటు తీవికి ముద్రగొనియున్న బురుజుపజ్జ మహాసివోలె వ్రేలు
ఈజగా పొగమబ్బులు రాజసేవ - మఱచిపోలేవు రసధునీ మహితమూర్తు
లేము లెక్కించుచుంటిమి యెన్నినాళ్లొ - చనెనొ అని వందవేళ్లుగా చాఁచుకొంచు.

అన్మదర్థాతిథేయారబ్ధములు రెడ్లభువి వంటశాలల పొగ లటంచు
అచట శ్రీనాథకావ్యశ్రోతలకు మాకు పఱచిన పంపిళ్ల పఱపులంచు
కొండకొమ్ముల తీర్చికొని నిల్చియున్న యాంధ్రభటాళి వీరగంధాలటంచు
ఉత్సవాగత జన మెమ్మరిగిపోఁ గొండకొమ్ములఁ దొంగి కను రెడ్లముగుదలనుచు
మున్ను గుత్తాల దాఁకించుకొన్న చోట - నడుగడుగునందు పాతంబులైన మాకు
నప్పుడప్పుడు తల లెత్తినంత కొండ - కొనల మబ్బులు పొరపెట్టి విసరులాడు.

ఒకసారి వలిపమ్ము చికిలి ముత్యాల యంచులవోలిక నుపత్యకల చరించు
ఒకసారి జఘనభాగోపరిస్రస్తచేల విధాన గిరి మొదళ్లఁ బడిపోవు
ఒకసారి గిరిలక్ష్మి మొగముపై మొగలి పుప్పొళ్లాఁదుకొన్నట్లు చెల్లరేఁగు
ఒకసారి స్వేదబిందుకములు రత్యంతవేళాకుచావృతి విస్తరించు
చిఱుత పొగమబ్బు లీకొండసీమ పలుచఁ - బడి, విశీర్ణమై, ధూళిమై, తడిసి, రాచ
సిరి యుడిగిపోయినట్టి యీశిథిలదుర్గ - లక్ష్మి కొనఁగూర్చు వెట్టి యలంకృతులను.

అధిరూఢకుండినేశాత్మజమయిన స్యందన గరుత్మన్మండితధ్వజమ్ము
గజపతిప్రౌఢోగ్రకరిఘటాశుండా విఘాతాంబునిచయబిందూత్కరంబు
రెడ్లకీర్తి పతాక శ్రీనాథకవికావ్యదూతహంసాధినాథుని గరుత్తు
అలకనవాహాత్రుపంటి రాఁజిన కృష్ణరాయ బాహాగ్రజాగ్రన్మహాగ్ని
ఒకటొకటి గాఁగ స్మృతి తెచ్చుచున్న వన్ని - చిఱుత లీ పొగమబ్బులు చిందులాడి
కొండవీటి ప్రాఁగోటపై కొమ్ములందు - నవ్యవక్షేందిరాధురంధరనిరూఢి.

నిప్పులుమాడ మన్నీ లుత్కళప్రౌఢపాత్రులు బురుజులపైన లేరు
ఈఁటెలఁ గ్రుమ్మ శౌర్యేందిరాపుంమూర్తులైన రెడ్లీకోటపైన లేరు

గుండెల కత్తులఁ గ్రుమ్మ రాయలరాచయేనికగున్న లీపైన లేరు
అడుగడుగునకుఁ బ్రాణ మాహుతిగొనఁగ ద్వాఃస్థాన రక్షకభటులైన లేరు
ఓసి పొగమబ్బులార! రండోసి రండు - మీకు మా కిష్టమే యిష్ట మాఁకలేక
తిరుగవచ్చు రాజులు కొల్వు తీర్చుచోట - నరుగవచ్చు రాకన్నె లున్నట్టిచోట.
ఎంతనిర్భయముగా నీ పొగమబ్బులు కొట్టేలబురుజుపై చిమ్మిరేఁగు
ఏ లెక్క లేనట్లు యీ పొగమబ్బులు మిరియాల తఖతుపై తఱిమిపోవు
ఇంతయడ్డంకి లే కీ పొగమబ్బులు తారా బురుజుమీఁద దాట్లువెట్టు
ఈ మాత్ర మాఁకలే కీ పొగమబ్బులు కేళిశుద్ధాంతసౌధాలఁ జొచ్చు
పిచ్చిపొగమబ్బులార! కోపించిరేని - చెడ్డవారు సుమీ! మిమ్ము చించి రొమ్ము
తాఁచి చెండాడిపోదు రడ్డంకిరెడ్లు - లేలిహానమ్ము లడ్డంకిలేని రెడ్లు.

ఇడుముల విలిఖించిరేమొ నా ముక్తాక్షరములుగా దుర్గకుడ్యముల నొలసి
ఇచట ముగ్గులు పెట్టిరేమొ నా క్షత్త్రముక్తారేఖగా గిరి స్థలము వెలసి
ఇట వితాన మమర్చిరేమొ నా మృదుమరుచ్చాలితమస్యమై చదలఁ దీర్చి
ఇట కేళకుళి కట్టిరేమొ నా తుందిల కీలలప్పృహత్పరిమించితములఁ గదలి
ప్రాతరసత్రికమింతయాము భానురోచి - రాసమాత్తధావళ్య మర్యాదమైన
తేఁత యీ పొగమబ్బు పురాతనంబు - త్రవ్వుచున్నది రెడ్లయాంధ్ర ప్రశస్తి.

ఇవి రెడ్లరాజుల యెదలలో పూరించుకోరాని కోర్కెలు గుములుకట్టి
ఇవి తెల్గుబంటుల యిందుఃసగింజలై నాత్మలు పీడలే కరుగుదెంచి
ఇవియు శ్రీనాథుని యెజ్జాప్రగ్గడ కావ్యతకు రానిభావముల్ తెరకట్టి
అవచితిప్పయసెట్టి వివి రత్నరాశిగా మలఁచప్రాణముల్ మగిడివచ్చి
కొండవీటిపాలాల్ పీడికోనులేక - ఆశబలమున మగుడు ప్రేతాత్మలవలె
సారిది నీగిరి కొమ్ములచుట్టుపట్ల - నిట్టిపొగమబ్బులై భ్రమియించుఁగాక.

నా ప్రాణములకును నీపొగమబ్బుల కేమిసంబంధమో యేనుగూడ
పొగమబ్బునై కొండచిగురుకొనలపైన బురుజులపైన కొమ్ములకుపైన
వ్రాలిపోనో మధ్య వ్రీలిపోనో నేల రాలిపోనో గాలి తేలిపోనొ
నాయూహ చక్రసుందరపరిభ్రమణమై యీ పొగమబ్బుల నేవరించె
ఎన్ని పొగమబ్బు లెటుఁగిలే నేను మున్ను - తూర్పుకనుమలు విడుచు నిట్టూర్పులట్టి
వీచటి యీ పొగమబ్బులే యెడఁదలోని - లలితము మదీయగీతి నేలా వెల్వార్చు!

---

# ఆంధ్ర జాతీయ కథావళి - చారిత్రక సాదృశ్యములు

టేకుమళ్ల రామచంద్ర రావుగారు, యమ్. ఏ., బి. యల్.

ప్రపంచమునందలి ప్రతిజాతికిని, ప్రతి మానవసంఘమునకును కొన్ని శారీరకలక్షణములు, స్వభావములు నున్నవని ప్రత్యేకముగ నుండును. వారిని చూచుటతోడనే వీరు చీనావారు, వీరు జపానువారు, వీరు అరబులు, వీరు మార్వాడీలు, వారు ఆంగ్లేయులు, వారు జర్మనులు అని మనము తెలిసికొనుచున్నాము. ఈ లక్షణాదులనుబట్టి మంగోలులు, టార్టారులు, నీగ్రోలు అను భేదములను గుర్తింపఁగలుగుచున్నాము. ఇవిగాక వారివారి భాషలనుబట్టియు, అందలి పదముల మైత్రిని బట్టియు జాతులను, జాతుల బాంధవ్యమును నిర్ధారింపఁగలుగుచున్నాము. ఈనిర్ధారణకు జాతీయ కథావళులు గూడ మిక్కిలి ముఖ్యములగు సహకారాధారములుగ నున్నవి. కాని యావిషయమై పరిశ్రమగాని పరిశోధన గాని జరుపఁబడుటలేదు. ఒక జాతియందలి జాతీయ కథావళియొక్క లక్షణములలోఁ గొన్ని వేఱొకజాతి యందలి జాతీయకథావళియొక్క లక్షణములతో మైత్రి గలిగియున్నట్లు మనకు గోచరించుచో ఆ రెండుజాతుల కునుఁగల పరస్పర బాంధవ్యము కొంతవఱకు వ్యక్తీకృత మగును. ఈకారణముచే నీపరిశోధన చాల ముఖ్యమైనది.

## జాతీయకథాస్వరూపము

జాతీయకథ లనఁగా నెట్టివి? అను ప్రశ్నకు రెండు ముక్కలతోఁ బ్రత్యుత్తరమిచ్చుట కష్టము. ఇప్పుడు మనభాషలో వ్రాయఁబడుచున్న నవలలలోని కథాభాగములు, ప్రబంధములందలి కథలు, పత్రికలలోను, పుస్తకరూపముననుఁ బ్రచురితములగుచున్న కథికలు—ఇవి జాతీయకథలు కావు. తెనాలి రామలింగని గూర్చిన కథలు, శ్రీనాథుఁడు, పోతన్న, తిక్కన మున్నగుకవులనుగూర్చిన కథలు, కాళిదాసు, విక్రమార్కుఁడు మున్నగు పురాతనపురుషుల కథలు—ఇవి జాతీయ కథలు. ఈ జాతీయ కథావళిలో నింక ననేకరకముల కథలు గలవు. అందుఁ గొన్ని బహురూపము, స్వభావము, సాదృశ్యము మొదలగునవి క్రింద విశదీకృతములగును. జాతీయ కథాస్వరూప నిరూపణ మెంతవఱకు గ్రహించుటకు పై యుదాహరణములు చాలును. జాతీయ కథలకును, జాతీయకథలు కానివానికిని పై యుదాహరణములను బట్టి కొన్ని భేదములను మనము గుర్తింపఁ గలుగుచున్నాము. ఇందు మొదటిది ప్రాచీనత; రెండవది సర్వవ్యాపకత్వము. ముఖ్యములగు నీరెండు లక్షణములు లేనిచో నేకథయు జాతీయ కథ కాఁజాలదు. ఆంధ్రదేశమునందలి యనేక గృహములలో తెనాలి రామలింగని కథలు, విక్రమార్కుని కథలు మొదలైనవి వ్యాప్తములై యున్నవిగదా? తరతరముల నుండియు నీకథలు చెప్పుకొనఁబడుచున్నవి గదా? కావున ప్రాచీనతయు, సర్వవ్యాపకత్వమును జాతీయ కథావళికి ముఖ్యలక్షణములు.

'జాతీయకథావళి' అను పదమునకుఁ గల యర్థమును రెండు తెగలుగ మనము విభజింపవచ్చును. ఇందు పై నుదాహృతములైన జాతీయకథ లొక్క తెగ. వీని కంటె నతిప్రాచీనము లగు కథ లనేకములు గలవు. ఈ రెండవతెగ కథలలో ననేకములు మనపూర్వులను గూర్చినవి. అవి జాతులయొక్కయు, వర్ణములయొక్కయు, వర్ణవిభాగములయొక్కయు, గ్రామాది దేవతల యొక్కయు కథలై యున్నవి. మఱికొన్ని హాస్యరస ప్రధానములు. కొన్ని సాహసక్రియలు, జిత్తులు, అద్భుతములు మున్నగువానితోఁ గూడినవై యున్నవి. ఈరెండు తెగులలోను మొదట పేర్కొనఁబడిన నతిప్రాచీనము లని యెల్లరు నెఱుఁగుదురు. ఈ కథ లిప్పటికిని ఆంధ్రదేశమునందలి యనేకగృహములలో చెప్పుకొనఁబడుచున్నవి.

దేవతలు సంతృప్తిగానిందించి పంపురుందురు. కాని, వారి నెంత చిన్నమాట యన్నను ఫకే మిక్కిలి కోపింతురు. అందులో తమ పొట్టితనము నెవ్వఁడైన యాక్షేపించుచో వానిపై కారములు మిరియములు నూరుదురనుటకు సందేహము లేదు. ఒకనాఁడొక బీదవాఁడు ప్రపంచమునందలి తన దుర్భర దారిద్ర్యము ననుభవింపఁజాలక కిలిమంజారో పర్వతశిఖర నివాసులగు పొట్టిపొట్టిదేవతలను దర్శింపఁ జేగెను. ఆదేవతలందఱును అచ్చట ఆటపాటలతో ప్రొద్దు పుచ్చుచుండిరి. అప్పటి కేఁగిన మానవుఁడు వారి కష్టవిఘ్నములను నమస్కారాదులను గావించి తానప్పటికేఁగిన కారణమును వారి కెఱుకపఱిచెను. వారును సంతసించి ఆబీదవానికి పశువుల ననేకముల నొసఁగి యింటికి పంపివేసిరి. ఇది చూచి మఱియొకఁడు తానుగూడ లాభము తెచ్చుకొందమని కిలిమంజారో పర్వతారోహణము గావించెను. అప్పట ముందు చెప్పిన పొట్టిదేవత లాటపాటల ప్రొద్దు పుచ్చుచుండుట వాఁడు చూచెను. వారు పిల్లలు గాఁబోలు ననుకొని "అబ్బాయిలూ, మీ అమ్మా, నాన్నా ఇంటికెప్పుడు వస్తారు?" అని ప్రశ్నించెను. తమను చిన్నపిల్లలనుగా భావించిన ఆ మానవునిపై వారి కెక్కడలేని కోపమువచ్చి పోపొమ్మని వాని నాదేవతలు తఱిమివేసిరి.

ఇట్టికథ భారతదేశపు కథలలో మన మెన్నఁడు వినలేదు. కావున జాతీయకథలను యావత్ప్రపంచము తోడను సాదృశ్యముండుట అరుదు. భారతదేశమునందైనను అన్నిభాషలకు నొకేరకపు జాతీయకథలు లేవు. కాని కొన్నిసాదృశ్యములు మాత్రము గలవు. కొన్నికథలలో నన్ను పాత్రముల ప్రాణ మెక్కడనో దాఁగియుండును. వంగ జాతీయకథలలో నిది విరివిగ కనఁబడుచున్నది. ఒక బెంగాలీకథలో రాజకుమారుని ప్రాణమొక హారమునందున్నట్లు వ్రాయఁబడెను. రాజకుమారుని శత్రువు లది ధరించుచో రాజకుమారుఁడు చనిపోవును. మెడనుండి తీసినచో నాతఁడు బ్రదుకును. మఱియొకకథలో కొందఱు రాక్షసుల ప్రాణము కొలనిలోపలి పెట్టెయందలి రెండీఁగలలో నున్నట్లువచింపఁబడెను. ఆ ఈఁగల నెత్తురుబొట్టు క్రిందపడకుండ వానినిబట్టి చంపినచో నా రాక్షసులు చనిపోదురు. ఆంధ్రదేశపు జాతీయకథలలో నిట్టి ననేకములు మనమెల్లరమును వినియున్నాము. ఇంకొక వింత యేమనఁగా ఈజిప్టుదేశమునఁగూడ నిదే యభిప్రాయమును వెల్లడించు జాతీయకథలు గలవు. ప్రపంచమునందలి జాతీయకథ లన్నింటిలోను నిప్పుడున్నవానిలో ప్రప్రాచీనమైన జాతీయకథ ఈజిప్టుదేశపు కథ. ఆకథలో 'బాటా' అనునొకని ప్రాణము దేవదారువృక్షములో నున్నట్లు వర్ణితమైనది. ఆ వృక్షమును కొట్టివేయఁగా నాతఁడు చనిపోయెను.

ఒకరాజకుమార్తె యొకరాజకుమారుని గాంధర్వ విధానము ప్రకారము వరించును. మఱియొక రాజకుమారుఁ డారాజకుమారిని బలవంతముగ తీసికొనిపోవును. ఆ రాజకుమారి రెండవ యాతని వరించుట కిష్టపడక ఆలు కెలలో, ఒకసంవత్సరమొ వ్రతమున్నదని చెప్పును. ఆ రెండవరాజు దీని కంగీకరించును. ఇంతలో పరిమితిగడువు పోవుచుండఁగా నిట్లో మొదటిరాజకుమారుఁడును నీరాజకుమారియుఁ గలిసికొందురు. ఇట్టి కథ లాంధ్రభాషయందును, వంగభాషయందును మాత్రమే గాక, యితరములగు కొన్ని భారతీయ భాషలయందును జాతీయకథలుగ వాడఁబడుచున్నవి.

## వంగాంధ్ర జాతీయ కథావళులు

వంగాంధ్రభాషల జాతీయకథావిషయమున, పై సాదృశ్యము లన్నిటికంటె వీని పరస్పర ప్రోద్బలమును స్పష్టీకరించు నద్భుతసాదృశ్యములు కొన్ని గోచరించుచున్నవి. ఈ క్రింది బెంగాలీకథను తీసికొందము.

అనఁగ ననఁగ నొకరాజు. ఆరాజునకు సంతానము లేకపోవుటచేత చాల విచారపడి తుదకు మిక్కిలి సౌందర్యవతియైన యొక బీదవారి యువతిని వివాహమాడెను. కాని రాజు పెద్దభార్యల కిది సరిపడలేదు. ఇంతలో నామె గర్భవతి యగుటచే రాజుగారి పెద్దభార్యలకు విచార మధికమయ్యెను. రాజుగా రూరలేని సమయములో నామెకు నొప్పులురాఁగా నామె కన్నులకు గంతలు గట్టి పెద్దభార్య లామె నొకచోటికి తీసికొనిపోయిరి. మంత్రసానిని వారు తోడుచేసికొనిరి. కథసారి

భార్య ప్రసవప్రకారమిట్లే కాఁబోలు నని వారు చెప్పినది చేయుచుండెను. పాప మాగర్భిణిని వారు నిచ్చెనమీఁద కెక్కమనిరి; దిగుమనిరి; మరల నిచ్చెనమీఁద కెక్కమనిరి. ఇట్లు జరిగిన తరువాత పుట్టిన కవలను చంపుమని మంత్రసాని కాజ్ఞాపించి, రాయి పుట్టినదని బాలింతరాలికి చూపిరి. రాజుగారీ రాయిపుట్టుక సంగతి విని నిర్విణ్ణుఁడయ్యెను. ఆ తరువాత కవలపిల్లలైన అన్నచెల్లెండ్రు రక్షితులై యుండఁగా, అన్న రాక్షసులను చంపి యొక రాకుమార్తెను వివాహమై తండ్రిని కలసికొని రాజయ్యెను.

ఈకథను చదివినవారికి వెంటనే మన యాంధ్రదేశమునందు సర్వత్ర వ్యాపించినదియు, కడుంగడు ప్రాచీనమైనదియు నగు నొక జాతీయకథ జ్ఞప్తికి రాక మానదు. ఈకథను మన పెద్దలు తరతరములనుండియు నీక్రిందివిధముగఁ జెప్పుచున్నారు.

అనఁగనఁగ ఒక రాజు. ఆయనకు భార్య లేడుగురు. సంతానమేమియు లేకపోవుటచే రాజుగారు చాల విచారాక్రాంతులై యుండిరి. ఇట్లుండఁగా కడసారి భార్య గర్భము దాల్చెను. దీనిమీఁద, వంతకు మునుపే గొప్ప ఈర్ష్యలో నున్న సవతుల కుముకుబోఁతుదిన మెక్కువయయ్యెను. ప్రసవసమయము సమీపించెను. అప్పుడు రాజుగారు వేఁటకుఁబోవ తటస్థించెను. ఆ సమయములో మంత్రసానిని తోడుచేసికొని ఆర్గురుసవతులును గలిసి గర్భవతికన్నులకు గంతలుకట్టి ఊరిబైట నున్న కంచె చేనిలోనికి తీసికొనిపోయిరి. అప్పటి నామె యొడినిండ నిన్ని రాళ్లు పోసి యొక నిచ్చెనమీఁది కాగర్భిణి నెక్కించుచు దింపుచుఁ 'ఎక్కుడిగ ఏడుసార్లు' చేసిరి. ప్రసవ మిట్లే గాఁబోలు ననుకొని యామె యూరకొనెను. ఆమె యొక బాలుని ప్రసవింపఁగా శిశువు నొకకంచెలో పారవైచి సవతులేడుగురు రాజభవనమును చేరిరి. కడసారి భార్యకు రాళ్లుపుట్టినవను విపరీతవార్త పల్లెపల్లెలకు వ్యాపించెను. కొన్నియేండ్లు గడచిపోయెను. ఆ పిమ్మట నొకబాలుఁడు బిచ్చము వేసికొనుచు రాజుగారి యింటికి వచ్చి యీక్రిందిప్రకారము పాడెను:—

* 'అనగనగనగనగనో రాజు
ఆరాజు కేడుగురు పెళ్లాలా
కడసారి పెళ్లాం మాయమ్మా
కంచెచేలో కన్నాదీ
ఉలవచేలో ఉగ్గోసీ
పత్తిచేలో పాలోసీ
పాటిమీద గడ్డోచ్చి
నన్ను పెంచింది
భగవతి భిక్షాం దేహి.

అప్పుడీ బాలునికథ తెలిసి రాజుగారు వానికి యౌవరాజ్య పట్టాభిషేకము గావించిరి. పై ఆరుగురు భార్యలను శిక్షించిరి.

దీనికంటె నింకను నత్యద్భుతమగు పోలికయొకటి వంగాంధ్ర జాతీయ కథావళులయందుఁ గానవచ్చుచున్నది. వంగాలీలు చిన్నపిల్లలకు జాతీయకథలు చెప్పునప్పుడు ప్రతి జాతీయకథ ముగియుటతోడనే దానికొక చిన్నకథను తగిలించుట వాడుకరై యున్నది. ఏకథ చెప్పినను సరే, యీచిన్నకథ దానిచివర చెప్పనిదే కథ పూర్తిగ ముగిసినట్లు లెక్కకాదు. ఈ ముగింపుకథ ఆంగ్లభాషలోనికి లాల్ బిహారి డే గారిచే పరివర్తన మొనర్పఁబడినది.* దాని నాంధ్రమున నీక్రింద వివరించెదను.

* ఈపాట ఆంధ్రుల ప్రాచీనకాలపు పద్యములందలి ప్రాచీనమైన వానిలో నింకను మనకు మిగిలియున్న వానిలోనిదనియు, పురాతనాంధ్ర ఛందోవిధి కిది సరిపోవుచున్నదనియు మా తండ్రిగారగు తేకుమళ్ల రాజగోపాలరావుగారు సిద్ధాంతీకరించియున్నారు.

*Thus my story endeth.
The Natiya thorn withereth.
Why, O Natiya, thorn dost wither
Why does the cow on me browse?
Why, O cow, dost thou browse?
Why does thy neat herd not tend me?
Why, O neat herd, dost not tend the cow?
Why does thy daughter-in-law not give me rice?

ఈలాగు కథ ముగిసినది
'నాతియా' మల్లి వాడిపోయినది
'నాతియా' మల్లీ, ఎందుకు వాడిపోయినావు?
నీ ఆవు నన్నెందుకు మేయవలెను?
ఆవూ, ఎందుకు మేసినావు?
నీ గొల్లవాఁడు నన్నెందుకు కాయలేదు?
గొల్లవాఁడా, ఆవునెందుకు కాయలేదు?
నీకోడలు నాకెందుకు అన్నము పెట్టలేదు?
కోడలా, ఎందుకు అన్నము పెట్టలేదు?
నా పిల్లవాడు ఎందుకు ఏడువవలెను?
పిల్లవాఁడా, ఎందుకు ఏడువవలెను?
చీమ నన్నెందుకు కుట్టినది?
చీమా, ఎందుకు కుట్టినావు?
కూట్, కూట్, కూట్!

ఆంధ్రభాషలో ఈ పై కథ కొన్ని మార్పులతో నున్నది. కాని ప్రతికథ తుదను తోఁకవలె వచ్చుకథగా మనము దీనిని వాఁడుటలేదు. దీనినే యొక స్వతంత్ర కథగా మనము మనభాషలో వాడుచున్నాము. ఈ కథ కున్నంత ప్రఖ్యాతియు, సర్వవ్యాపకత్వమును మనభాషలోని నింకేకథకును లేవు. నూటికి తొంబదితొమ్మిదిమంది వంతు ప్రతియాంధ్ర బాలుఁడును, బాలికయు మొట్ట మొదట నేర్చుకొను కథ యిదియే. ఈ కథ రూపరియిష్ట మువచ్చినట్లు వారు చెప్పుటకు వీలులేదు. అందుపయుక్తములగు పదములును, పద్ధతియు నొకసంప్రదాయము ననుసరించియున్నవి. ఈ పద్ధతిని మీారుటకు వలనుపడదు గావున ఈ పద్ధతిప్రకారమే ఆ యాంధ్ర కథ నీక్రింద వ్రాయుచున్నాను.

అనగా అనగా ఒకరాజు.
ఆరాజు కేడుగురు కొడుకులు.
ఏడుగురుకొడుకులూ వేటకెళ్లారు.
ఏడుచేపలు తీసుకొచ్చారు.
ఏడుచేపలూ ఎండేశారు.
అందులో ఒకచేప ఎండిందికాదు.
చేపా, చేపా, ఎందుకెండావుకావే?
గడ్డి దుబ్బ అడ్డంవచ్చింది.
గడ్డిదుబ్బా, గడ్డిదుబ్బా, ఎందుకు అడ్డం వచ్చావే?
ఆవు మేసిందికాదు.
ఆవా, ఆవా, ఎందుకు మేశావుకావే?
గొల్లాడు మేపాడుకాడు.
గొల్లాడా, గొల్లాడా, ఎందుకు మేపావు కావురా?
అవ్వ గంజి పోసిందికాదు.
అవ్వా, అవ్వా, గంజిఎందుకు పోశావుకావే?
పిల్ల ఏడుస్తూఉంది.
పిల్లా, పిల్లా, ఎందు కేడుస్తున్నావే?
చీమ కుట్టింది.
చీమా, చీమా, ఎందుకు కుట్టావే?
నాబంగారు పుట్టలో వేలుపెడితే నేను కుట్టనా?

బెంగాలీభాషలో తోఁకకథగనున్న కథకును, ఆంధ్రమున స్వతంత్రకథగనున్న యీకథకును గల పోలికను పాఠకు లెల్లరును సులభముగ గ్రహించియుందురు గావున దీనిపై విస్తరింప బూనుకొనను.

ఆంధ్ర బెంగాలీ భాషలందలి జాతీయకథలకు మఱొక్క ముఖ్యమగు పోలిక గలదని మనకుఁ గనఁబడుచున్నది. ఆంధ్రులవలెనే బెంగాలీలును కథాంతమున ముగింపుగ నొక నియమిత పదజాలము నుపయోగించుచున్నారు. బెంగాలీలో పైకథయే యీనియమిత పదజాలము. ఇట్లే ఆంధ్రభాషలో ప్రతికథాంతమునను మనము

కథ కంచి కెళ్లింది,
మనం ఇంటి కొచ్చాం.

అను నియమిత పదజాలమును చేర్చుచున్నాము. ఇది లేకుండ మనము కథను దేనిని ముగించుటలేదు. ఈవిధ

Why, O daughter-in-law, not give rice?
Why does my child cry?
Why, O child, dost thou cry?
Why does the ant bite me?
Why, O ant, dost thou bite?
Koot, Koot, Koot.

యమున నితర భాషలవారికిని ఆంధ్రులకును చాలభేదము గలదు. ఒక్క బెంగాలీభాషలోను, మన భాషలోను దప్ప నింకే భాషయందును కథాంతమున నిట్లొక నియమిత పదజాల ముపయోగింపఁబడుట లేదు.

ఈ వ్యాసమునందు సూచితములైన పోలికలను బట్టి ఆంధ్రజాతీయకథావళికిని వంగజాతీయకథావళికిని ఏదో దగ్గఱచుట్టఱిక మున్నట్లు మనకు గోచరించును. ఈ విషయమై పరిశోధన చేయవలసియున్నది. ఇంతియేకాక యితర భాషలతో మనభాష కీవిషయమునఁ గల పోలికలను వ్యక్తీకరించుటకు పరిశోధకులు బయలు దేఱవలెను.

ఆంధ్రజాతీయకథావళి యనఁగా నేమియో యుపోద్ఘాతభాగమున కొంత చర్చించియుంటిని. ఆ పిమ్మట ప్రపంచమునందలి వేఱు వేఱు భాగము లందలి జాతీయ కథలతోడి సాదృశ్యమును కొలఁదిగ చూపితిని. ఆపిమ్మట ఆంధ్రజాతీయకథావళికిని ఇతర భారతీయ భాషలందలి జాతీయకథావళికిని, (ముఖ్యముగ బెంగాలీ జాతీయ కథావళికి) గల సాదృశ్యమునుగూర్చి వ్రాసితిని. ఆ పిమ్మట నన్నిటికంటె హెచ్చువ విలువగల వంగాంధ్ర జాతీయ కథా సాదృశ్యమును నాయోపినంతవఱకు పోలికలుఁ గనఁబఱచితిని. పోలికలలో కొన్ని అల్పమైన నీవిషయమున పరిశోధనచేఁ బరిశోల్పఁగలుగుదురో నాయీవ్యాసము వారిచే బహూకరింపఁబడినదని నా యభిప్రాయము.

---

## బాష్పసందేశము

జి. జాషువ గారు

ఆలోకింపు మొకింత భారతకుమారా! నిందు పెద్దమ్మచే
గాలింపంబడి, దుమ్ముచే మలయు సంక్రాంతి దూర్గ నిరా
శాలంబంబున, నీ మహోన్నత సుధాసౌధంబు క్రీనీడలం
దాలుం బిడ్డలు బిచ్చమెత్త నిరతం బల్లాడు మానుష్యముల్.

నీసోదర్యులు వారు కారనుచు సందేహింతువో వీరి స్వే
చ్ఛాసామగ్రి గళించి, వత్సరసహస్రంబు ల్చనెన్, దీని కీ
వే, సాక్ష్యంబవు, కారణంబ వివుడేమి మించిపోలేదు, ఆ
శ్వాసింపంగదవయ్య భారతతనూజా! ప్రాతచుట్టంబులన్.

కుడుము నోసంగఁ బండు వనుకొండు రమాయకు లిప్పుడైన నీ
మడులును మాన్యము ల్పసిడిమాడువు లిమ్మన రింటనుండు పెం
పుడు పసరంబులట్టుల మముల్ గణియించినఁ జాలునంచు నీ
యడుగుల నోటి దీనముగ నంజలిఁ బట్టిరి ధర్మభిక్షకై.

అనఘగుండమ్ములు దిక్కుమాలి, పురబాహ్యక్షోణి గూరాడ, పెం
చ్చిన సౌభాగ్యసువర్ణమందిర సమాసీనుఁడవై, హాయిగా

కనుమూయం దగవా? పరాకుపడి, యింక౯ మేలుకొమ్మా! ధరా
జనయిత్రీమణి, తమ్ముగుఱ్ఱలకు స్వేచ్ఛాభిక్ష లర్థించెద౯.

ఆనందంబున నీ సహోదరులు విద్యాస్వీకృతిం జెందినా
రీనాఁ డల్లదె శుభ్రవస్త్రములతో చేతెంచుచున్నారు, నీ
తో నిత్యోచిత దైవపూజకని, సంతోషంబున౯ జేర్పుకో
వేని న్నిక్కము స్వార్థలోలుఁడవుసుమ్మీ! భారతీనందనా!

ఎన్నో వందలయేండ్లు దాటిపదిగాదే? నీదు నీ స్వార్థపుం
బన్నాగంబునఁ గప్పివేయఁబడి నీ ప్రాంతంబు పాషాణమౌ!
“అన్నా! పాప్తత్వ మొసంగుమీ” యనుచు నేఁ దర్థించుచున్నార లీ
కున్న న్నన్నును గౌరవాగ్రజునిగా నూహింపఁ గోపింతువే!

కరుణావీరుఁడు భారతీయుఁ డని దీర్ఘవ్యాసముల్ వ్రాసి, నీ
కొరకై వైరికి వెన్నుసూపని యనుంగుజట్టముల్ పేసు, దు
ర్భరదాస్యంబు సహింపనోప రనుకంపం జూప వోనింక, నీ
తరళాపాంగము కేసుగన్నది, నితాంత న్యాయశాద్దృష్టికి౯.

కారుణ్యంబున-వంటరానితనము౯ ఖండింపవా? యీ నిరా
ధారవ్యక్తుల శోషణంబు వినరాదా నీకు? పాశ్చాత్యులా
“మా రాజ్యం బిడుమంచు గోరుకొనుచున్నా రిట్టి నీ కిత్తురా?
ప్రారంభంబున నిన్ను దిద్దుకొనుమయ్యా! కోర్కె సిద్ధించెడి౯.

కరవింపారెడు నీవిభూతికి శిరఃకంపంబు గావింపవా?
పరదేశంబులు పూర్వమీయదినము నీ స్వార్థక్రియాకేళి పో
దర విద్వేష మెఱింగి మూతివిఱుచు౯ దద్దేశముల్, నీయెకో
బరము౯ జెమ్మట గొట్టుచున్న వీక విస్పంబోలు స్నేహాబ్జముల్.

మా ముత్తాతలనాటినుండి నిను సన్మానించి, నీకోసమై
మా దేహంగల రక్తబిందువుల సంపత్తిక౯ సమర్పించినా,
మేమో! నీదు మనంబులో నిసరులే దీపస్తు “ఇంకెప్పు డ
న్నా! మా కష్టము గట్టుకొమ్ము” యనుచున్నా రేమి వ్రాయుత్తురో.

---

# శ్రీ రంగనాథ దేవాలయ శిల్పచిత్రములు




చిత్రము ౧.

ఈ మూడు చిత్రములు శ్రీ రంగనాథస్వామి దేవాలయమునందలి స్తంభములపై గల సుందర శిల్పసంపదను తెలుపును.—శ్రీరంగము.

శ్రీ రంగనాథ దేవాలయ శిల్పచిత్రములు

A — — B

— D

PLAN AT A B



చిత్రము ౨.

PLAN AT C D



చిత్రము 3.

లింగ్కు పాణిని కాత్యాయనునికి సమకాలీనుడనియు, వారిద్దరును నందవంశమునకు సమకాలికులనియు నందుచే పాణిని క్రీ. పూ. ౪ వ శతాబ్దిమధ్యమున నుండెననియు నభిప్రాయపడుచున్నారు. ఈ వాదమంతయు కథాసరిత్సాగరమునందలి యొకకథపై నాధారపడియుండుటచే సరియైనదికాదు. ఇతరాధారములతో పాణిని కాలనిర్ణయము చేయవచ్చును. పాణినికాలమునకు ప్రాకృతభాష పుట్టియుండలేదు. ప్రాకృతశబ్దమున కసంస్కృతమగు భాషయనియే యాతని యర్థము. ఆతని గ్రంథములలో నెచ్చటను బుద్ధుని ప్రశంసయే లేదు. మహాభారత యుద్ధమును, శతాబ్ధీయులను గూర్చియు చెప్పుచు నాతడు వాసుదేవక, అర్జునక యను రెండు మతములను పేర్కొనుచున్నాడు. దీనినుండి పాణిని బుద్ధునికి పూర్వుడనియు మహాభారతయుద్ధమునకు తరువాతివాడనియు తెలియుచున్నది. భారతయుద్ధమునకును, పాణినికిని నడుమనుండుకాలము భారతవీరులు దైవతములుగ పరిగణింపబడి, యనేకులచే నారాధింపబడుటకు తగినంత దీర్ఘముగ నుండవలెను. అటులనే పాణినికిని, బుద్ధునికిని నడుమగల యంతరము ప్రాకృతభాష యుత్పన్నించి పామరవ్యవహారమునకు తగినదిగ నుండియుండవలెను. భారతయుద్ధకాలము సుమారు క్రీ. పూ. ౧౯౨౨ సంవత్సరము. బుద్ధనిర్వాణము క్రీ. పూ. ౫౪౩. అవగా పాణిని క్రీ. పూ. ౧౯—౬. శతాబ్దముల మధ్యమున నుండవలెను. గాన నాతడు క్రీ. పూ. ౧౬ శతాబ్దమునకో, నిశ్చితముగ ౯ వ శతాబ్దమునకు పూర్వుడనో యుండెనని చెప్పవలెను.

## బ్రాహ్మణవాఙ్మయము

ఇంతియగాక వేదములందును వానికి సంబంధించిన వాఙ్మయమునందునుగూడ లేఖనవిషయికములగు నిదర్శనము లనేకములు గలవు. ఋగ్వేదాంతర్గతమగు వాసిష్ఠధర్మసూత్రము వేదకాలమున లేఖనమతి వ్యాప్తముగనుండినటుల తెలుపుచున్నది. వసిష్ఠుడు, లిఖితపత్రములు ఋజాపను సాక్ష్యమని యనువదించుచు, ప్రాచీనతరమగు నొక మూలమును చూపుచున్నాడు.[20] వైదికవాఙ్మయమున "అక్షర, పటల, కాండ, గ్రంథ" మున్నగు లిపిబోధకములగు పదములు గాంచనగుచున్నవి. వైదికయుగమునందలి యత్యున్నతమగు నాగరికత ప్రవృద్ధమగు వాణిజ్యము, క్లిష్టములగు వార్షికపరివర్తనములు, గద్యరచనము, వేదమంత్రములయొక్క సంగ్రహణము, సూచీకరణపరిగణనాదులును, వేదాంగములందలి వైయాకరణ మాంత్రిక కోశపరిశోధనలు—వీనినుండి వేదకాలమున నొకవిధమగు లిపియుండెనని విశదమగుచున్నది. పురాణేతిహాసకావ్యాదులందును, ప్రత్యక్షజీవితమును ప్రతిబింబింపజేయు నాటకాదులయందును, వైదికములగు ధర్మశాస్త్రాదులందును, కల్పితములగు నీతినాట్యకామాది శాస్త్రములందునుగూడ లిపినిగూర్చియు పుస్తకముల గూర్చియు పెక్కుతావుల గాంచనగును.[21] వేదవాఙ్మయమున లిపినిగూర్చి చెప్పవిషయమును అక్షరపరిజ్ఞానము, సంఖ్యాజ్ఞానము నను రెండు శీర్షికల క్రింద విభజింపవచ్చును.

ఆకాలమున సంఖ్యాలేఖనము తెలిసియుండెననుట యీక్రింది నిదర్శనములనుండి తెలియుచున్నది. ఋగ్వేదమున అయుతమను (౧౦౦౦౦) సంఖ్యయు, దశాధికములను గూడ గలవు.[22] యజుర్వేదమునందలి వాజసనేయ సంహిత యీక్రింది సంఖ్యాలేఖనము నిచ్చుచున్నది.

| | |
|---|---|
| | ౧ |
| | ౧౦ |
| | ౧౦౦ |
| | ౧౦౦౦ |
| అయుత | ౧౦౦౦౦ |
| నియుత | ౧౦౦౦౦౦ |
| ప్రయుత | ౧౦౦౦౦౦౦ |
| అర్బుద | ౧౦౦౦౦౦౦౦ |
| న్యర్బుద | ౧౦౦౦౦౦౦౦౦ |
| సముద్ర | ౧౦౦౦౦౦౦౦౦౦ |
| మధ్య | ౧౦౦౦౦౦౦౦౦౦౦ |
| అంత | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦ |
| పరార్ధ | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦ |

20. XVI—x-14-15.
21. St. Petersburgh Dictionary J. Dahalman—Das Mahabharata 188 ff—S. B. E. XXV India Documents—Hemadri—Danakanda Ch.7,p.544—Kamasutra I—3.
22. R. V. IV—32, 18, Ibid VIII—32. 18.

దెను. కాన నీమాతన లిపి సుమారు. క్రీ. పూ. ౧౫౦౦ నాటికి యుద్భవమందెనని చెప్పవచ్చును. ఈ లిపియే పాణినీయునిబంధనలకు పిమ్మట బ్రాహ్మి యన బరగెను.

## బ్రాహ్మికి పూర్వపులిపి

బ్రాహ్మిలిపియొక్క సంస్కరణా నియమితత్వములనుండి, యాలిపి కొంతకాలము ప్రాకృతస్థితిలో నుండి యుండెనని తెలియుచున్నది. అట్టి యసంస్కృత బ్రాహ్మిలిపియే దేవనాగరీ యని పిలువబడుచుండెను.

ఆర్యులు మనదేశమునకు వచ్చునప్పుడు వారి లిపి ప్రథమమున చిత్రరూపమువనో, లేక రెండవదగు మాత్రారూపమువనో యుండెను. పిమ్మట నిప్పటనే యక్షర నియమము జరిగెను. అనగా నార్యులు మధ్యాసియాలో నుండినకాలమున నక్షరోత్పత్తి కాలేదు. అటులు గాని రెండుల మధ్య ఆసియానుండి విడబడి నైనా, అస్సీరి యాదిదేశములకేగిన యార్యజాతులు నైనా, అస్సీరి యాదిభాషలనుగూడ హిందూఆర్యులవలెనే యక్షర బద్ధములుగ జేసి యుందురు. అటులుగాక నేటికిని నైనా మొదలగు దేశములభాషలు మాత్రాబద్ధములుగనే యున్నవి. ఆర్యులీ దేశమునకు సుమారు క్రీ. పూ. ౪౦౦౦ సంవత్సరములకు పూర్వము వచ్చియుందురు. కాన క్రీ. పూ. ౧౫—౧౪. శతాబ్దములలో సంస్కరణము, బ్రాహ్మిలిపియుద్భవము నగుటకు పూర్వ మీ దేశమునందలి లిపి చిత్రరూపమువనో, మాత్రారూపమువనో యుండెనని చెప్పవచ్చును.

## బ్రాహ్మిలిపి - ఉత్పత్తి

బ్రాహ్మిలిపియొక్క యుత్పత్తినిగూర్చి యనేక లనేకాభిప్రాయముల నిచ్చియున్నారు. వీబర్, ఫోక్ లింగ్ పండితు లశోకశాసనములే భారతీయలిపి పరిజ్ఞానమున కాద్యనిదర్శనము లనుచున్నారు ప్రిన్సెప్ గారశోకునిశాసనములలో లిపి యనఘలిపి భవమనుచున్నారు. ఆర్ ఫ్రైజ్, మూలర్, పిశార్ అనుపండితులు యుతని ననుసరించుచున్నారు.[25] హైందవలిపి దేశీయ మనునది యింకొకవాదము దీనిని లాస్సెన్ ప్రతిపాదించెను. ఎడ్వర్డుథామస్‌గారు దక్షిణదేశమునందలి ద్రావిడ జాతులలో నిది యుద్భవించె ననుచున్నారు.[26] అలెగ్జాండరు కన్నింగ్‌హ్యాంగారి యభిప్రాయము ననుసరించి యిది రూపచిత్రములనుండి పుట్టినది.[27] డౌసనుపండితు డయ్యది ప్రత్యేకనిర్మాణ మనుచున్నాడు. సర్ విలియం జోన్సుగారు మన లిపి సెమిటిక్ జాతులనుండి వచ్చిన దనుచున్నారు. డీ కే, సెయిలర్ అను పరిశోధకులు దక్షిణ అరేబియాలోని దక్షిణ సెమిటిక్ జాతులలిపియే హైందవలిపికి మాతృకయనియు, వీబర్, బూహ్లర్ అనువారుత్తరఅరేబియాలోని ఫినోషియనులనుండి బ్రాహ్మి లిపి పుట్టినదనియు వాదించుచున్నారు. మొత్తము మీద నీకడపటివాదము సర్వసమ్మతముగ పరిగణింపబడుచున్నది. కాని యీ యభిప్రాయము సరియైనది గాదని డి. ఆర్. భండార్కర్, రాయ్‌బహాదూర్ విష్ణుసురూప్ మున్నగువారు తలంచుచున్నారు.[28] విదేశీయవాదము నుపపాదించువారు కేవల లిపి సామ్యముపై నాధారపడుచున్నారు. ఏకాలమున నీ యనుసరణము చేయబడెను. భారతీయులకును, ఫినోషియనులకు నేవిధమగు సంబంధముండి యుండెనను ప్రశ్నలకు వారు సమాధానము నొసంగజాలకున్నారు.

దేశీయవాదులు బ్రాహ్మిలిపి తత్పూర్వమగు చిత్రలిపినుండి వచ్చినదని చెప్పుచున్నారు. విష్ణుస్వరూప్ గారు సహేతుకముగ విదేశీయవాదమును ఖండించియున్నారు. బి. ఇ. డిరోగ్ అను నాయన ఫినోషియను లిపి ఈజిప్టుదేశపు చిత్రలిపినుండివచ్చినదనియు, డీ కే, గారయ్యది యస్సీరియను దేశలిపి సంభవమనియు తెంచుచున్నారు. కేవలాక్షరరూపసామ్యమునే యాధారపఱచుకొని బ్రాహ్మిలిపి ఫినోషియను లిపిభవమను బూహ్

25. A Isaac Taylor—The Alphabet, Vol. II p. 304.
26. Numismatic chronical (N. S.) III I. R. A. S. (N. S.) V. 1420—27.
27. C. II.—I. p. 52.
28. Asutosh Mukerjee Silver Jubilee Vol. III p. 539, I. B. O. R. S. VIII, p.238.

లరుగారి వాదమునకల సహేతుకత్వమే ఫినీషియనుల లిపియే బ్రాహ్మీనిర్గతమనుటయందును గలదని విష్ణుస్వరూప్‌గారు వాదించుచున్నారు. క్రీ. పూ. ౧౫వ శతాబ్దమున నిర్మింపబడిన బ్రాహ్మీలిపి క్రీ. పూ. ౧౧౧౧ సంవత్సరములవాటి ఫినీషియనుల లిపినుండి జనితమనుట నిరర్థకముగ గనుపించును. కేవలరూపసామ్యమే గాక యుక్తరనిర్దేశమునగూడ బ్రాహ్మీ ఫినీషియను లిపికి మాతృకగా నగపడుచున్నది. హిందూదేశముతో ఫనీషియనులు వర్తకవ్యాపారము చేయుచుండిరి. వారలు బ్రాహ్మీని దమలిపిగా గ్రహించియుందురు. వారినుండి వారితో నెక్కుడు సంబంధమునుగల ఫినీషియనులు హైందవలిపిని నేర్చుకొనియుందురు.

## హైందవ చిత్ర లిపి

బ్రాహ్మీలిపి తత్పూర్వవిస్తృతమగు చిత్రలిపి నుండి వచ్చినదని పైన చెప్పబడినది. దానికే దేవనాగరీయని పేరు. అట్టిలిపి మనదేశమున నుండియుండెననుటకును, అయ్యది క్రీ. పూ. ౧౧౧౧ సంవత్సరముల వరకు నుపయోగింపబడుచుండెననుటకును నిదర్శనములు గలవు. ఇంతవరకు నీదేశమున చిత్రలిపిలోని వ్రాతలు మూడు గను గొనబడినవి—

౧. హైదరబాదులో గన్గొనబడిన గృహోపకరణ పాత్రలపై గల చిత్రములు.

౨. పాట్నాజిల్లా రాక్‌ఘర్‌లోని రాతిపై చిత్రములు.

౩. హరపాముద్రలపై చిత్రములు.

వీనిలో హరపాముద్రలపై చిత్రముల సాంకేతికమును గనుగొనుటకు జయస్వాల్, ఫ్లీట్ మున్నగు పండితులు ప్రయత్నించిరి. కాని వీరందరును ఫినీషియను ధనమును బ్రాహ్మీలిపిలోనే యాచిత్రములు లిఖింపబడినవను నభిప్రాయముగలవారై వానిని సరిగా ననువదింపజాలకపోయిరి. విష్ణుస్వరూప్‌గారు ఆముద్రలపై చిహ్నములు చిత్రలిపియని యెంచి యాముద్రలపై నామములను "భీమదేవ విశ్రావస, కదర్వ, శాంతమూర్త"యని ప్రతిపాదించుచున్నారు. పిమ్మట నీ ముద్రలకాలమునుగూడ వారీక్రిందివిధమున నిర్ణయించుచున్నారు. విష్ణు, భాగవత పురాణములందును, దయానందస్వామి విరచితమగు సత్యార్థప్రకాశయందును పాండవ వంశము వర్ణింపబడినది. అందు యుధిష్ఠిరునినుండి ముప్పది తరతి రాజులు పేర్కొనబడుచున్నారు.

ఆవంశమున ౨౧వ వాడు భీమదేవుడు. ౨౪వ వాడు కదర్వ. ౩౧వ రాజు క్షేమకునికి విశ్రావసుడను మంత్రి యుండెను. అతడు తన స్వామిని చంపి రాజ్యమాక్రమించి ప్రత్యేకముగ నొక వంశమును స్థాపించెను. పరీక్షిత్తు, క్రీ. పూ. ౨౬౧౧ లలో రాజ్యమునకు వచ్చెను. తరమునకు ౩౧ సంవత్సరముల చొప్పున లెక్కించినయెడల విశ్రావసుడు క్రీ. పూ. ౧౨౩౦ వాటివాడగును. గాన క్రీ. పూ. ౧౧౦౧ సంవత్సరమువాటికిగూడ చిత్రలిపి వాడుకలో నుండెనని తెలియుచున్నది.

---

# పాతపాటలు

టే. కామేశ్వరరావు గారు, బి. ఏ.

ఉపోద్ఘాతము

[ఈ పాతపాటలు నా పెద్దకుమారుడగు టేకుమళ్ల కామేశ్వరరావు, బి. ఎ., కష్టపడి సేకరించినవి. ఆతనికి చాలకాలమునుండియు నిట్టిపాటలను, సామెతలను, కథలను, జాతీయములను (Idioms) కూర్చి యుంచుకొనుట యొకయభిమాన కార్యముగా నుండెను. ఈ పాతపాటలలో జాలభాగము వారల్లిగారి నోటనుండి వ్రాసికొనెను. కొన్నిటిని విజయనగరమునందును, మరికొన్నిటిని బెల్లారునందును సంపాదించెను.

ఆతను సుమారు రెండువేలకంటె నెక్కుడుగా తెలుగు సామెతలను, లోకోక్తులను, సమహార్చ్యను. ఇదిగాక ఆంధ్రజాతీయములు (Telugu Idioms) చాలయున్నవి. ఈజాతీయములు చాల చిత్రముగ నుండును. బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, స్త్రీలు, పురుషులు మున్నగువారు మాట్లాడుచున్నప్పుడు స్వభావసిద్ధముగాను, అవాలోచితముగాను వారి సంభాషణలయందు వాడుకచేయబడు ప్రత్యేక విలక్షణప్రయోగములు వీనియందు గాన్పించుచుండును. వీని నన్నిటిని సంధానించుటకై తను చాలకాలము నిరాడంబరమైన పరిశ్రమచేయవలసి వచ్చెను.

ఆతను సేకరించిన భాషావిస్తృతసముదాయములో పాతపాటలను మాత్రము ప్రస్తుతము భారతి పత్రికలో ముద్రించుటకు పత్రికాధిపతు లంగీకరించిరి. ఇందలి జోలపాటలను ప్రచురించుటకు ముఖ్యకారణము లేవనిన—

(౧) శిశుపోషణజేసెడు తలిదండ్రులకు యువతీయువకులు తమపిల్లల నోదార్చుటకును, ఉబుసుపుచ్చుటకును, నిద్దుర పెట్టుటకును, యీ జోలపాటలను పాడిన నెక్కువ యుపయోగముగా నుండును.

(౨) ప్రస్తుతము ప్రాథమిక పాఠశాలలలో జరుపుచున్న బాలురకును, బాలికలకును వాచకపుస్తకముల ననేకులు విద్యాధికులు వ్రాయుచున్నారు. అట్టి వాచకపుస్తకములలో శిశుతరగతి కుపయోగించెడు పాఠములు ముఖ్యముగా బాలగీతములు Nursery Rhymes రూపముగానుండుట చాల మంచిదని అనుభవైకవేద్యమైన విషయము. కావున వాచకపుస్తకములను వ్రాసెడు యుపాధ్యాయులు ఈజోలపాటలనుంచి నచ్చినవాని చేర్చి తీసికొనవచ్చును.

(౩) ఆంధ్రజాతీయత సర్వతోముఖముగా వృద్ధినొందుటకు జనసామాన్యమందున్న యైతిహ్యపారంపర్య విద్య (Traditional lore) నశింపకుండ జాగ్రత పెట్టవలసియున్నది.

పైనచెప్పిన కారణములచేత నిటువంటి పాతపాటలను బాలగీతాభిమానులు సంపాదించి ప్రచురింతురుగాక !

—టేకుమళ్ల అచ్యుతరావు.]

## జోలపాటలు

౧

ఊ చక్క వూగదే వుయ్యాలచేరు
పా దక్క న్నిదపోదు పట్టి అబ్బాయి.

౨

విశాఖపట్నాన విసిరిందిగాలి
విజయనగరపు రేవున్న తేలిందె వాడ

వర్తకుశి పేరేమి వాడ పేరేమి
వాడలో పోసిన్న దినుసు పేరేమి
వర్తకుడు అబ్బాయి వాడ నా వాడ
వాడలోపోసిన్న దినుసు ముత్యాలు.

౩

ఇంతంత దీపమ్మ యిల్లల్ల వెలుగు
ఈశ్వరుడి చందమామ జగతెల్ల వెలుగు
గోరంత దీపమ్మ కొండల్ల వెలుగు
గోపాలకృష్ణమ్మ మందల్ల వెలుగు
మాడంతదీపమ్మ మేడలకు వెలుగు
మారాజు అబ్బాయి మాకళ్ల వెలుగు.

౪

సూర్యుడు చంద్రుడు అన్నదమ్ముల్లు
సూటిగుఱ్ఱాలెక్కి జూదమాడేరు
అబ్బాయి తమ్ముడు అన్నదమ్ముల్లు
లక్కపావా లెక్కి లెక్క రాసేరు.

౫

ఏటిగట్టుమీాద సంధ్యల్లు వార్చి
ఎఱ్ఱన్ని చినవాడు ఎవరి అబ్బాయి
నాగగంధపు చెవులపోగు లున్నాయి
నా మేనల్లుడు రార అబ్బాయి!

౬

ఏటిగట్టుమీాద కరివేపచెట్టు
గాలివానవచ్చి కొమ్మ లల్లాడె
కొమ్మలల్లాడనే గొలుసు లల్లాడె
కొనికొన్ని ముత్యాలచేరు లల్లాడె
ఆచెట్లపైనుండి అబ్బాయిరాగ
బంగారుతలపాగ చెంగు లల్లాడె.

౭

ఏవాడ వెళ్లేవు అబ్బాయి, నువ్వు
ఎవ్వరు కట్టేరు కాళ్ల మువ్వల్లు
కలవారిపట్నన్ని గారాములన్ని
కంచారికట్టెడె కంచుమువ్వల్లు
తనతోడి పట్టన్ని తనకు ముద్దన్ని
అన్నయ్యకట్టెడె వెండిమువ్వల్లు.

౮

చిక్కూడు పువ్వెరుపు చిలకము క్కెరుపు
చిగురెరుపు చింతల్ల దోరపం డెరుపు
రక్కిసపండెరుపు రాగిచెం బెరుపు
రాచవారిళ్లలో మాణిక్య మెరుపు
తాయెరుపు అమ్మాయి తనవారిలోన.

౯

ఏనుగు నెక్కెయ్యె ఓరాజురాగ
ఏకదివాణమ్మ యెవరి లోగిలి
పల్లకి ఎక్కేయే ఓరాజు రాగ
బంగారుతలుపుల్ది యెవరి లోగిలి
అందలా లెక్కెయ్యె ఓరాజు రాగ
అద్దాలతలుపుల్ది యెవరి లోగిలి
ఏనూగ నెక్కెయ్యె అబ్బాయిరాగ
ఏకదివాణమ్మ వదినె లోగిలి
పల్లకీనెక్కెయ్యె అబ్బాయి రాగ
బంగారుతలుపుల్ది వదినె లోగిలి
అందలా లెక్కెయ్యె అబ్బాయిరాగ
అద్దాలతలుపుల్ది వదినె లోగిలి.

## జంబుకేశ్వర దేవాలయ శిల్పచిత్రములు




౮. జంబుకేశ్వర దేవాలయ స్తంభముపై గల శిల్పసంపద (జంబుకేశ్వరము తిరుచినాపల్లికి చేరువ నున్నది)



౨. జంబుకేశ్వర దేవాలయ ద్వారకవాటము

౧౦

గంధమ్ము తీసిన్న సాన చల్లన్న
సభలోన అబ్బాయిమాట చల్లన్న
ఇందావ తీసిన్న నీళ్లు చల్లన్న
ఇంట్లోన అమ్మాయి కడుపు చల్లన్న

౧౧

గోపాలకృష్ణమ్మ పెళ్లయ్యేనాడు
గోరింట పూచింది కొమ్మలేకుండ
మాయింటి అబ్బాయి పెళ్లయ్యేనాడు
మల్లెల్లు పూచేయి మొగ్గలేకుండ.

౧౨

ఉయ్యాలలో బాల వుగ్గు కేడుస్తే
ఉత్తమ్మ యేశోద పూచి వుగ్గోయ్యె
పల్లకీలో బాల పాలకేడుస్తే
బలభద్ర మాలక్ష్మి పాడి పాలోయ్యె
ఏటిక్కి కాలువ యెంతదూరమ్ము
యెత్తిపెంచినతల్లి కెంత మోహమ్ము
కాలువ నీళ్లన్ని కడుసముద్ర మాయె
కడలేనిమోహామే కన్నతల్లిక్కి.

౧౩

ఊరిక్కి ఉద్యోగరాజు వచ్చేడు
విడిమట్టు చూపండి విందు నాయిల్లు.
ఊరిక్కి ఉద్యోగరాజు అబ్బాయి
విడిమట్టు నీయిల్లు విందు నాయిల్లు.

౧౪

ఆటల్లు పాటల్లు అత్తవారింట
అతి రాచచిటిపనులు అమ్మగారింట.

౧౫

తోటాకూరా చెట్టయ్యవలెను
దొగ్గలి పెరిగింది దొడ్డిముందార
రాచయింటా కన్నెయ్యవలెను
అబ్బాయియింటికే వచ్చింది కన్నె.

౧౬

చిక్కుడాకూమీద చిలక వాలింది
చిల కెక్కి ఓరాజు చిక్కివున్నాడు
అరిటాకుమీద హంస వాలింది
హం సెక్కి ఓరాజు అమిరివున్నాడు
కొబ్బరాకుమీద గోర వాలింది
గో రెక్కి ఓరాజు కోరివున్నాడు
మామిడాకుమీద మంచు వాలింది
మం చెక్కి ఓరాజు పొంచివున్నాడు
గుమ్మడాకుమీద గువ్వ వాలింది
గు వ్వెక్కి ఓరాజు గూడొగ్గినాడు
చిక్కుడాకుమీద చిలకఅబ్బాయి
చిల కెక్కి అమ్మాయి చిక్కివున్నాది
అరిటాకుమీదనే హంసఅబ్బాయి
హం సెక్కి అమ్మాయి అమిరివున్నాది
కొబ్బరాకుమీద గోర అబ్బాయి
గో రెక్కిఅమ్మాయి కోరివున్నాది
మామిడాకుమీద మంచు అబ్బాయి
మం చెక్కి అమ్మాయి పొంచివున్నాది
గుమ్మిడాకుమీద గువ్వ అబ్బాయి
గు వ్వెక్కిఅమ్మాయి గూ డొగ్గినాది.

౧౭

వేసంగికాలాన ఓ, పెళ్లికొడకా
వేపతోరణాల నీడనే రమ్మి

మాయింటి అబ్బాయి పెళ్లియ్యేనాడు
మామిడితోరణాలు మరి దూరిరమ్మి.

౧౮

దేవ్వాడిగుళ్లోను దేవు డాడీని
దేవేంద్రసభలోన జూద మాడీని
పరమేశ్వరుడు గుళ్లోను పాము లాడీని
పణతి నా నట్టింట బొల లాడీని.

౧౯

పిల్లి పిల్లిపి ల్లి పిల్లలకుతల్లి
పల్లేరుముళ్లలో పాలిచ్చి పోవె
పిల్లలికి పాలోసి పల్లెలికి బంపి
అబ్బాయికి పాలోసి ఆడుకో బంపు.

౨౦

వీధి నెందరు వున్న విన రేగాలి
రచ్చ నెందరువున్న రాదమ్మ వాన
నా చిన్నఅబ్బాయి వీధి నిలుచుంటే
మొగలిపువ్వులగాలి ముత్యాలవాన.

౨౧

చిలక లాడేనమ్మ హంస లాడేని
పావురా లాడేని పందిళ్లలోన
చిలక నాఅబ్బాయి హంస అమ్మాయి
పావురం కుఱ్ఱవాడు పందిళ్లలోన.

౨౨

పిల్లెమ్మకన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయికన్నులు కలువ రేకుల్లు
కలువ రేకులవంటి నీ కన్నులాకు
కాటుకలు పెట్టితే నీకు అందమ్మ.

౨౩

ఏడవకు ఏడవకు వెఱ్ఱినాతండ్రి
ఏడుస్తెనీకళ్ల నీరు కారేని
నీళ్లాను కారితే నేచూడ లేను
పాలైన కారవే బంగారుకళ్ల.

౨౪

చింత చెట్టుకింద చిటిబొమ్మరిల్లు
వాటిక్కి వాకిళ్లు బోరుతలుపుల్లు
బోరుతలుపులకింద పొందైన మేడ
ఆ మేడ నున్నాయి యిద్దరు హంసల్లు—ఆ మేడ.
ఆయిద్దరు హంసల్ల పేరేమి పేరు—ఆ యిద్దరు.
రాచిలుకఅబ్బాయిరంభ అమ్మాయి-రాచిలుక.
చిలుకలకు చెలి కాడు తాను అబ్బాయి-చిలుక
హంసలకు చెలికత్తె తాను అమ్మాయి. [లకు.

౨౫

అబ్బాయిమామల్లు యెటువంటివారు
చెవికిచెవికి బారెడేసి పోగుల్లవారు—చెవికి.
అంచుపంచెలవారు అంగీలవారు—అంచు.
పట్టుపంచెలవారు పాగాలవారు—పట్టు.
పెసర కాయవంటి పెదిమెల్ల వారు—పెసర.
కంది కాయలవంటి కనుబొమ్మల్ల వారు—కంది.
మిరప కాయలవంటి మీసాలవారు—మిరప.
వారు మా అబ్బాయి మేనమామల్లు.

౨౬

తామలపాకులమీద రేకల్లువ్రాసి
తమ్ము డంపినాడె తనముద్దుమాట
తనముద్దుమాటొకటి దబ్బపండొకటి
"నాచిన్నతమ్ముడు రార అబ్బాయి."

౨౭

గోరింటపువ్వువంటి కొడుకు నెత్తుకొని
బాలింత వచ్చింది బావినీళ్లక్కు
ఏదేది బాలింత యెంత చక్కందో
మా చిన్నిపట్టుచీర మణవలకు పసువు
కళ్లదీ కాటుక పళ్లదీ మెరుపు
మావాడ బాలింత అబ్బాయితల్లి.

౨౮

తూర్పున్న అబ్బాయి యిల్లుకట్టేడు
దూలాలుమోసేరు దూదిపరుపుల్లు
పడమటను అబ్బాయి యిల్లుకట్టేడు
పట్టెల్లు మోసేరు పాలకావిళ్లు
దక్షిణాన్ని అబ్బాయి యిల్లుకట్టేడు
దండెల్లు మోసేరు ధనముపెట్టెలు
ఉత్తరాన అబ్బాయి యిల్లుకట్టేడు.

*　　*　　*　　*

౨౯

తాతల్లు గట్టిన్న ధర్మశాలల్లు
అవ్వలు అలికిన అరుగుల్లమీద
ముత్తవ్వలు పెట్టిన ముగ్గులమీద
కూచోర అబ్బాయి కుదిమట్టుగాను—కూ.
ఊచవే అమ్మాయి ఫుయ్యాలచేరు—ఊచవే.
పాడవే అమ్మాయి బలగ మందర్ని—పాడవే.
ధరణిచే రట్టుకొని తనవార్ని పాడే—ధరణి.
భూమిచేరట్టుకొని పుత్రుణ్ని పాడే.

౩౦

ఊరిముందర డేర లెవ్వరివి
ఉత్తమ్మబిరుదుల్ల రా జెవ్వరమ్మ
ఊరిముందర డేరల్లుమావి
ఉత్తమ్మ బిరుదుల్ల రాజు అబ్బాయి.

౩౧

ఆయిఆయిఆయి ఆపదలు గాయి
చిన్నవాళ్లను కాయి శ్రీవెంకటేశ
గాయిగాయి గాయి ఏదమ్మగాయి
అంగళ్ల ఆడేటి అబ్బాయిని గాయి
పోలేరమ్మ పొత్తుళ్లగాయి
పొత్తుళ్లనాడేటి అబ్బాయి గాయి.

౩౨

చిన్నారిపాచికలు మావిలోగిళ్లు
చిన్నబాలా ఆడు చినబాల్లుతోడి
బంగారు పాచికలు మావిలోగిళ్లు
బాలలాడేరు మా అబ్బాయి తోడి.

౩౩

కోటంత దేవుడికి మేటంతపత్రి
బ్రహ్మంత ఆయుస్సు నీకు నా బాబు.

౩౪

జోలల్లుపాడితే జొన్నల్లుపండు
జోలలకు జొనబువ్వ నీకు వరిబువ్వ
ఏడ్చేటి అబ్బాయికి యెఱ్ఱావుపాలు
నాచిన్న అబ్బాయికి నల్లావుపాలు.

౩౫

అబ్బాని కొట్టిన కొట్టు వ్రేళ్ల రట్టు
తేర మా అబ్బాయికి ముత్యాలబొట్టు
ముత్యాలబొట్టుకీ మూడు రేకల్లు
రత్నాలబొట్టుకీ రావిరేకల్లు

వజ్రాలుస్థాపించిన వారి మామల్లు
మాణిక్యాలు స్థాపించిన వారి బాబుల్లు.

౩౬

అబ్బిని కొట్టిన కొట్టు పూరెల్ల రట్టు
తేరె మా అబ్బాయికి తేనె గాజుల్లు
ముత్యాలబొట్టెట్టి పట్టుచీరగట్టి
ముద్దువచ్చింది మా అబ్బాయిమోము-ముద్దు.
అద్దమైతోచింది వద్దిమామలకు—అద్దమై.
మేలిమై తోచింది మేనమామలకు—మేలి.
మేనమామలముద్దు మేలిమ్మి ముద్దు—మేన.
తాతలకు తమ చిన్నఅబ్బాయి ముద్దు.

౩౭

చిట్టి నాఅబ్బాయి చిఱుమొగము చూచి
సిగ్గుపడి చంద్రుడూ పొడవజాలాడు.

౩౮

ముద్దుల్లు ముద్దుల్లు ముచ్చికాయల్లు
అమ్మాయి ముద్దుల్లు గచ్చకాయల్లు.

[సశేషము.]

---

## కవితాప్రణయిని

చలమయ్య ప్రసాదరావులు

కాషాయాంబర సౌధవీథుల ననంగ జ్యోతియో మోహినీ
వేషోన్మేషవిలాస రాశియగు నావిద్యుల్లతా తన్వియో
ఆషాఢంబున మేఘనాథ! నిను నాహ్వానింప వేంచేసె ను
ద్ఘోషించెన్ గకుబంతవీథి సుమనఃకోదండ టంకారముల్.

అతఁడు పూవింటివాఁడు ప్రేయసి దృగంత-మాలికలయందు ననురాగపాళికలయి
జారుచున్న కజ్జలరేఖఁ జారలాడి-మోహరించిన యువతీమనోహరుండు.

ఫుల్లసరోజినీ మధువు పుక్కిటిబంటిగఁ ద్రావి పద్మినీ
వల్లభుఁ డస్తమించెఁ బసిపాపనిఁ బొత్తిటిలోన నిల్పి నన్ను నా
తల్లి దయార్ద్రదృక్కుల సుధారసధారలఁ దేల్చుచుండెః—వి
ద్యుల్లత కాంతులన్ బితుకుచుండెఁ దళుక్కునఁ దాండవించుచున్.

క్షేత్రలక్ష్మి కుమారు నాశీర్వదించి-కనకవర్షంబు గురిసి యతుత లొసంగ
శ్రీ సరస్వతీదేవి నర్చించియుంటి-పూలతోఁ బత్రితోఁ గళాశాలయందు.

అంత రసైకమోహితుఁడనై విహరించితి భావకన్యక సు
ధాంత రహస్యగోష్ఠి. నడయాడితి నాసెలయేటిపాట త్రు
ళ్లింతలఁ బాలకృష్ణమురళీకలగానపువింత లప్సరః
కాంతల రంతులన్ గని నిగారపుకైతల నిగ్గులేరితిన్.

మధురగళంబునెత్తి మధుమాసపికాంగన శ్రావ్యగీతముల్
మధు వొలికించునాఁడు రసలాలసవృత్తిఁ జరించు మన్మనః
పథమునఁదోఁచె నొక్క కలభాషిణి కావ్యకళావిభూషయై
అధరమునందుఁ గెంపువిడియంబు చలింపని లింపకన్యనాన్.

అభినవకవితాకన్యవో,-ప్రభాతసంధ్యావసంతలక్ష్మివో, భాషా
ప్రభు నూత్నప్రణయినివో, త్రిభువనమోహిని,-పలుకవె తీయము లొలుకన్ ?

ప్రకృతిగీతాలు పాడేటిపసుచువాఁడ-ప్రేమభిక్షంబుఁ గొఱకుఁ బ్రార్థించుచుంటి
రసికు లౌననఁ నాంధ్రభారతికి నాకుఁ-బోహణింపవె పన్నీటిపూలపాన్పు ?

పలుకుకలకండ మాధురుల్ గిలకరించి-జోలపాటలఁ బాడి యుయ్యాల లూఁపి
పెంచి ముచ్చట్లఁ దీర్చె నాపెద్దతండ్రి-అతని కాదని యేల వచ్చితివి చెలియ !

కాలియందెలి గజ్జెలు ఘల్లురనఁగ-క్రీడ లాడించి రచ్చ కెక్కించినాఁడు
లజ్జ విడనాడి పినతండ్రి పజ్జనుండి-యింతలో నేల వచ్చితివే లతాంగి ?

చిన్ననాఁటిముచ్చటలుఁ దీర్చినది యొకఁడు-తనువు పులకింపఁ గీర్తి తెచ్చినది యొకఁడు
ఇంటికోడలినట్లు మన్నించినారు-ప్రౌఢ నేవచ్చియుంటి యౌవనకుమార !

పెద్దమామ పోకిళ్లలోఁ బెరిగియుంటి-చిన్నమామ శిక్షలయందుఁ జిక్కియుంటి
పాలవంటి యౌవనము నీపాలుచేయ-నేఁగుదెంచితి ననుఁ గటాక్షింపు మనఘ !

---

మూలయ్య

ఎక్కడ కనిపించాడు నీకు?

పుట్టయ్య

కావేరిఒడ్డున కళ్లు మూసుకు కూర్చున్నాడు.

మూలయ్య

ఇంటికి తీసుకురాలేకపోయావా?

పుట్టయ్య

పలకరిస్తే పలకడు. కళ్లు మూసుకు అదే కూర్చో వడం. తిండి లేదు. నిద్ర లేదు.

మూలయ్య

మరేమి చేస్తూ ఉంటాడు అస్తమానం ఆగట్టున కూర్చుని?

పుట్టయ్య

ఏమి చేస్తూ ఉంటాడని చెప్పను? ఎప్పుడైనా కళ్లు తెరిచినప్పుడు 'రంగా' 'రంగా' అని ఒళ్లు తెలియని కేకలువేసి గంతులువేస్తూ ఉంటాడు.

మూలయ్య

బ్రాహ్మల్లో పుట్టవలసినవాడు మనలో తప్పి జారి పుట్టాడనుకొంటాను.

పుట్టయ్య

అన్నింటికన్న ఆశ్చర్యం ఏమిటో విన్నావా?

మూలయ్య

ఏమిటా ఆశ్చర్యం?

పుట్టయ్య

ఒంటినిండా దెబ్బలే. ఒళ్లంతా రాళ్ల దెబ్బ లతో కదుములు కట్టింది. రక్తాలు కారుతూ ఉన్నా ఏమీ తెలియనట్లు ఎప్పుడూ "రంగా రంగా" అని అరుస్తూ ఉంటాడు.

మూలయ్య

రాళ్ల దెబ్బ లెందుకు తగిలినవి? కళ్లు మూసుకు కావేరిగట్టున కూర్చున్నవాడికి రాళ్లదెబ్బల కర్మ మేమిటి?

పుట్టయ్య

నిన్న ఉదయం బ్రాహ్మలు ఏనుగుమీద బంగారుబిందె పెట్టి కావేరికి నీళ్లకోసం వచ్చారుట.

మూలయ్య

ఎందుకు?

పుట్టయ్య

బ్రాహ్మణవాడలో శ్రీరంగనాయకుల దేవాలయం లేదురా?

మూలయ్య

అవును, ఉంది, ఉంది. నీటిబరువుతో వంగిన మేఘములాగ దాని గోపురము ఆకాశంమీద కనిపించడం నేను దూరంనుంచి చూచాను.

పుట్టయ్య

శ్రీరంగనాయకులకు ప్రతీదినమూ కావేరీజలముతో మజ్జనం చేయిస్తారుట.

మూలయ్య
అందుకా వస్త బ్రాహ్మలు?

పుట్టయ్య
అప్పుడు రేవుపక్క ఇసుకలో పాణయ్య కళ్లు మూసుకు కూర్చుని ఉన్నాడట.

మూలయ్య
బ్రాహ్మలు వస్తే మరి లేచి దూరంగా వెళ్ల లేదూ?

పుట్టయ్య
ఎవరు వచ్చారో ఎవరు వెళ్లారో వాడి కేమైనా తెలిస్తేనా?

మూలయ్య
ఏమి జరిగిం దప్పుడు?

పుట్టయ్య
బ్రాహ్మలు పాణయ్యను చూచి లెమ్మని కేకలు వేశారుట. ఎంత లెమ్మన్నా లేవక పోతే రాళ్లు విసిరారుట.

మూలయ్య
బ్రాహ్మలకు అడ్డంగా కూర్చుంటే విసరరుమరీ?

పుట్టయ్య
అందులోనూ దేవకార్యం కోసం వచ్చిన బ్రాహ్మలాయెను!

మూలయ్య
పాపం రాళ్లు తగిలేయి కాబోలు పాణయ్యకు?

పుట్టయ్య
చెప్పానుకాదూ, ఒళ్లు కదుములు కట్టిందని.

మూలయ్య
చివరకి ఏమి జరిగినట్లు?

పుట్టయ్య
వాళ్లు విసిరిన రాళ్ల దెబ్బలవల్లో, భక్త్యావేశము వల్లో పాణయ్య కొంతసేపటికి కళ్లు తెరిచి బ్రాహ్మలందరినీ చూచాడట. చూచి తటాలున లేచి, "రంగా, రంగా, ఎంతమంది రంగల్లో, ఎంతమంది రంగల్లో" అని వాళ్లవేపు పరుగెత్తాడుట.

మూలయ్య
ఎంతపని చేశాడు!

పుట్టయ్య
బ్రాహ్మలందరూ ఎక్కడ మీద పడతాడో అని నాలుగుదిక్కులా పరుగెత్తుకు వెళ్లి వాడిమీదకు మరీ బెడ్డలు విసిరారుట.

మూలయ్య
పాపం. తెలిసి చేస్తాడో తెలియక చేస్తాడో ఇలాంటిపనులు వాడు?

పుట్టయ్య
తెలిసి తెలిసి ఆలాగంటిపనుల చేసేవాడు కాడు మన పాణయ్య.

మూలయ్య
వాడికి దెయ్యమే పట్టిందో భూతమే పట్టిందో మరి?

పుట్టయ్య
ఆ రాళ్లదెబ్బలచేతో మరి ఎంచేతో వాడు ఒళ్లు తెలియకుండా క్రింద పడిపోయాడుట. వాడిని తప్పించుకొని బ్రాహ్మలు రేవుకు వెళ్లి నీళ్లు ముంచుకు వెళ్లి పోయారుట.

మూలయ్య

వాడి సంగతి ఏమైనట్టు?

పుట్టయ్య

కొంత సేపు అలాగ పడిఉండగా వర్షం పడింది. అతనికి తెలివి వచ్చింది. తెలివి వచ్చాక అతను నాలుగువైపులా చూచి, "అయ్యో! ఏరీ నా రంగళ్లు, ఏరీ నారంగళ్లు" అని తల బాదుకు ఏడ్చాడుట.

మూలయ్య

అయ్యో సత్యకాలమా!

పుట్టయ్య

అలాగ ఏడ్చి ఏడ్చి తరవాత తనను కొట్టిన రాళ్లనన్నింటినీ ఎంతో భయభక్తులతో పోగు చేసి ముద్దుపెట్టుకొని, మళ్ల ఆఇసుకలోనే కూర్చుని ఆ రాళ్లతో చుట్టూ ప్రాకారంలాగ కట్టి ఆ ప్రాకారంలో రంగనాథుడి దేవాలయం చిత్రించి, దాన్ని చూస్తూ, రంగా, రంగా అంటూ కళ్లు మూసుకొని ఒళ్లు మరిచి కూర్చుండి పోయాడు. ఎవ రెంత పిలిచినా పలకడు.

మూలయ్య

వీ డిలాంటి పనులు చేస్తూఉంటే మనందరికీ ఏమి వస్తుందో అని నాకు భయంగా ఉంది.

పుట్టయ్య

మనమాట కేమి? వాడిమాట ఆలోచిస్తున్నాను, నేను! ఇది నిజంగా భక్తి అంటావా, పిచ్చి అంటావా?

మూలయ్య

తన్ను కొట్టిన రాళ్లను భయభక్తులతో పోగు చెయ్యడం ఎందుకో?

పుట్టయ్య

ఎందుకా? "మా రంగళ్లు నా కిచ్చా రీ రాళ్లు• మా రంగళ్లు నా కిచ్చారు. వీటితో నన్ను దేవాలయం కట్టుకో మన్నారు. నా రంగడికి వీటితో దేవాలయం కడతాను. మా రంగళ్లు ఎంత మంచివాళ్లు. మారంగళ్లకి నామీద ఎంతదయ" అని వాడు అరుస్తూ కట్టాడుట ఆ ప్రాకారం!

మూలయ్య

ఇది పిచ్చిలాగే ఉంది నామట్టుకు.

పుట్టయ్య

రంగనాథుడి దేవాలయం ప్రవేశించి సొంతంగా రంగనాథుణ్ణి తాను చూడగలుగుతే ఈ పిచ్చి పోతుందేమో అతనికి!

మూలయ్య

ఎందువల్ల?

పుట్టయ్య

ఎరగవూ? చిన్నప్పటినుంచి ఏ మనీవాడో? "ఆ దేవాలయంలో రంగనాథుణ్ణి మనం ఎలాగ చూడ్డం? రంగనాథుడికి మనమీద దయ లేదా? ఉంటే మన నెందుకు దూరంగా ఉంచుతున్నాడు? మనవి మాత్రం హృదయాలు కావా? మన హృదయాలుమాత్రం రంగనాథుణ్ణి చూడవలెనని తహతహ పడవా? రంగనాథుణ్ణి

చూడలేని జన్మ ఎందుకు? ఎప్పటికైనా ఈజన్మలో రంగనాథుణ్ణి నేను చూచి తీరుతాను"అని.

మూలయ్య

అదే వాడికి పిచ్చి!

పుట్టయ్య

ఈ పిచ్చికి మందేమిటో బ్రాహ్మలనే అడిగి తెలుసుకుందాము.

మూలయ్య

ఇది మన కులానికి అనర్థం కలగడానికే వచ్చింది. లేకపోతే మనకి రంగనాథు డేమిటి? బ్రాహ్మలు అంటే ఎవరు? వారు కొలిచే రంగధాముణ్ణి మనం కొలవడ మేమిటి? బ్రాహ్మలకి అపచారం చేస్తే ఎంతపాపం!

పుట్టయ్య

అవును మరి. పాణయ్యకి పుట్టుకతోనే పుట్టింది ఇలాంటి బుద్ధి. ఇది మంచికే వచ్చిందో చెడ్డకే వచ్చిందో.

మూలయ్య

అయినా దేవు డెక్కడ లేడు? ఆ దేవాలయంలో ఉండే రంగనాథుడే తనకు కావా లనడం ఎందుకంట?

పుట్టయ్య

ఏమి చెప్పను?

మూలయ్య

ఇదేదో అనర్థం కోసమే వచ్చింది.

పుట్టయ్య

ఉండరా ఉండరా. అదుగో చూడు. బ్రాహ్మలు ఎందుకో చెప్మా మన మాలపల్లెకు వస్తున్నారు?

మూలయ్య

నే చెప్పలేదూ? ఇదేదో మన కొంపమీదికి వచ్చేటట్లే ఉంది. ఇక్కడ ఉండకుండా మన్ని పొమ్మనే అంటారో, శిక్షించనే శిక్షిస్తారో!

పుట్టయ్య

బ్రాహ్మలు మాలపల్లెకు ఎందుకు రావాలో? మనపాపం పండింది. బ్రాహ్మలు మాలపల్లిలో కాలుపెడితే ఆపాపం ఎవరిదీ?

మూలయ్య

ఊరుకో, మాట్లాడకు. ఈమూల నిలబడదాము రా. వాళ్లకు అడ్డు నిలవరాదు.

పుట్టయ్య

అలాగే. ఏమి చేసే దిప్పుడు? చూడు చూడు. మనవాళ్లంతా గొల్లున గోల పెట్టుతున్నారు: "రావద్దు, రావద్దు. స్వాములారా! ఇది మాలపల్లి రావ"ద్దని. మనముకూడా రావద్దని కేకలు వేద్దామా?

మూలయ్య

వేద్దాము. లేకుంటే ఆపాపం మన్ని చుట్టుకుంటుంది.

పుట్టయ్య

బాబుల్లారా! ఇటు రాకండి,ఇవి మాలకొంపలు. బ్రాహ్మలు రాకూడనివి.

మూలయ్య

స్వాములారా! రాకండి రాకండి. చెప్పని పాపం మాది. చెపుతున్నాము. మీరు బ్రాహ్మలు. ఇవి మాలకొంపలు. రాకండి. ఇటు రాకండి

పుట్టయ్య

తెలియక వస్తున్నారేమో, మా దేవుళ్లు మీరు. రాకండి. ఇటు రాకండి. ఇవి మాలకొంపలు.

[ఇద్దరు బ్రాహ్మలు ప్రవేశము]

[దూరముగా ఉండి పుట్టయ్య, మూలయ్య సాష్టాంగపడతారు.]

మూలయ్య

బాబుల్లారా! క్షమించండి. తెలియక చేసిన తప్పులు. మా తప్పులు మీరు కాయకపోతే ఎవరు కాస్తారు?

పుట్టయ్య

మా పాణయ్యకు చిన్నప్పటినుంచీ పిచ్చే. ఆ పిచ్చిలో వాడు ఒళ్లు తెలియని పనులు చేస్తూ ఉంటాడు. తప్పులు క్షమించండి. ఇక ముందు వాడి విషయంలో జాగ్రత్తపడతాము.

దేశికాచారి

ఎక్కడరా పాణయ్య?

పుట్టయ్య

బాబూ, వాడు పిచ్చివాడు. ఈమాటికి వాడి తప్పు కాయండి. మమ్మల్ని రక్షించండి.

మూలయ్య

తమరు వర్తమానం చేస్తే మేము రామా? తాము మా పాడుపల్లికి రావాలా ప్రభువులు?

దేశికాచారి

ఏమిరా ఆ అసంబద్ధ ప్రలాపము? ఎక్కడరా పాణయ్య!

పుట్టయ్య

[మూలయ్య ముఖముకేసి చూచి మాట్లాడక ఊరుకొనును.]

మూలయ్య

[చేతులు జోడించుకొని] రక్షించండి నా తండ్రులు. వాడు పిచ్చివాడు. వాడిని బతకనివ్వండి. ఈపాలికి మా తప్పు కాయండి.

దేశికాచారి

మూర్ఖుడా! ఏమిరా ఆ ప్రలాపము. చెప్పరా! పాణయ్య ఎక్కడ ఉన్నాడు? రాజుగారి ఆజ్ఞ అయిందిరా!

మూలయ్య, పుట్టయ్య

అమ్మో! బాబో! మా కొంపలు మునిగేయి. రాజుగారి ఆజ్ఞే.

దేశికాచారి

అవునురా, ఇంకో గడియకు రాజుగారే వస్తారురా, పాణయ్యను చూడడానికి!

పుట్టయ్య

రాజుగారు రావడమే, రాజుగారు రావడమే!

మూలయ్య

రాజుగారు స్వయముగా శిక్షిస్తారు కాబోలు! రాజుగారు స్వయముగా శిక్షించేటంత తప్పు చేశాడు కాబోలు పాణయ్య!

దేశికాచారి

శిక్ష ఎందుకురా మూర్ఖుడా! రాజుగారు స్వయముగా వచ్చి పాణయ్యను రథంమీద ఊరేగిస్తూ తీసుకువెడతారు.

పుట్టయ్య

తెలియక అడుగుతున్నాను, క్షమించండి బ్రాహ్మణదేవుళ్లు. మాపాణయ్యను శిక్షించ డానికి కాదూ వస్తూఉంట రాజుగారు?

దేశికాచారి

కాదురా, పాణయ్యను రంగనాధుడి దగ్గిరికి స్వయముగా తీసుకువెళ్లడానికి వస్తున్నారు.

మూలయ్య

స్వాములు మనతో వేళాకోళ మాడుచున్నారు. రక్షించండి, మీరే మా దేవుళ్లు. మీరు తలుచు కొంటే చెయ్యలేని దేమిటి?

దేశికాచారి

మీరు శుద్ధమూర్ఖులు. చెప్పితే తెలియదా? పాణయ్యమీద రాజుగారికి దయ గలిగింది. ఇక మాట్లాడక ఇక్కడకు అతన్ని తీసుకరండి. లేదా, రాజుగారు వస్తున్నారని చెప్పి వాడిని సిద్ధంగా ఉండమని చెప్పండి. ఇక మాట్లాడక వెళ్లండి.

[మూలయ్య, పుట్టయ్య వెళ్లిపోతారు.]

వేదాంతం

ఈమాలపల్లెలో కాలు పెడితే నాకు ఒళ్లు గరి పొడుస్తోంది.

దేశికాచారి

ఎందు వల్లనో?

వేదాంతం

నాజన్మలో ఇటువంటి అకార్యకరణము చేస్తా నని ఎప్పుడూ అనుకోలేదు. అందువల్ల ఈ గగుర్పాటు.

దేశికాచారి

శ్రీరంగనాధ కటాక్షముచేత పావనమైనది కాదా ఈ మాలపల్లి. ఇంక దీనికి రంగక్షేత్ర మహిమ కలిగిం దన్నమాట.

వేదాంతం

అవును. కాని ఆమాట మనస్సు వినడంలేదు.

దేశికాచారి

ఆచారము ఒక్కొక్కప్పుడు ధర్మాన్ని నాశ ముచేస్తుంది. ధర్మమని తెలిసిఉండిన్నీ ఆచారా నికి దాసుల మౌతున్నాము మనము.

వేదాంతం

అవును. తెలియని విషయంకాదు. ఆమాటకి వస్తే భగవంతుడు లేని తావేది? రంగధాముని కటాక్షమున మెలగనివా రేరీ? రంగధాముడికి జాతిమతాలు కావాలా, భక్తి కావాలా? ఇవన్నీ తెలిసిఉండినా ఆచారానికి భిన్నంగా ప్రవర్తిం చడమంటే మనస్సు ఒప్పుకోదు.

దేశికాచారి

అది మానవస్వభావమేమో? లేక పూర్వా ర్జిత కర్మఫలమో!

వేదాంతం

ఈకలికాలంలో ఇటువంటి వింతలు పుట్టడం మాట చెప్పు.

దేశికాచారి

రంగనాధుడు కావేరీ తీరవాసి, ప్రత్యక్షదైవం. ఇంకా సందేహ ముందా?

వేదాంతం

పాణయ్యను కొట్టినదెబ్బలు రంగనాథుడి ఒంటి మీద కనిపించడం మాట చెప్పు!

దేశికాచారి

పాణయ్య ఎవడో మాలవా డనుకొన్నాము కాని ఇటువంటి భక్తాగ్రేసరుడని ఎవరూ అనుకో లేదు.

వేదాంతం

రంగనాథుడి కటాక్షంవల్ల ఒక భక్తాగ్రేసరుడు మనకు తెలిశాడు.

దేశికాచారి

అంతే కాదు; భక్తుడూ భగవంతుడూ ఒక్కటే అని కూడ నిరూపించాడు శ్రీరంగధాముడు.

వేదాంతం

ఎంతమహత్తు ఎంతమహత్తు మన శ్రీరంగనాయకుల వారిది!

దేశికాచారి

మానవులు ఆదేశప్రియులూ, ఆచరణరహితులూ కావడంవల్ల రంగనాథుడే రాజుగారికి కలలో స్వయముగా ప్రత్యక్ష మయ్యాడుట.

వేదాంతం

కాకపోతే పాణయ్య రాళ్లదెబ్బలకి ప్రాణాలు విడిచిపెట్టవలసినవాడే.

దేశికాచారి

అగ్రజాతుల భక్తిలేశము అతిమాత్రముగా మనము వర్ణిస్తాము. అంత్యజుల అవిరళభక్తిని తృణీకరిస్తాము. ఈలోపము సవరించడానికే రంగధాముడు రాజుగారి కలలో కనిపించి ఉంటాడు.

వేదాంతం

తనతోపాటు తనభక్తుణ్ణికూడా ప్రజలు పూజించవలెనని అట్లా చేసిఉంటాడు రంగనాథుడు.

దేశికాచారి

పరిమిత జ్ఞానముతో సర్వజ్ఞునిఊహలు గ్రహించడానికి ప్రయత్నిస్తున్నాము మనము.

వేదాంతం

జన్మదోషమో, వర్ణదోషమో కాని, భగవంతుణ్ణి మనమే గుత్తగొంటున్నాము. మనము కట్టుకొన్న ప్రాకారాల మధ్యనే భగవంతుణ్ణి బంధించకోరే మన ఊహలు తప్పని ఇప్పుడు బోధపడింది.

దేశికాచారి

భగవంతుడి కౌగిలి మానవుల కందరకూ క్రీడారంగమన్నమాట ఇప్పుడు తెలిసింది.

వేదాంతం

కాని ఒకమాట చెప్పుతాను, విను. పాణయ్యను మన మిప్పుడు మనకూటములో చేర్చుకొంటాము కాని పాణయ్యవంటివా డింకొక్కడు మళ్లీ పుట్టితే వాడిని రాళ్లతో రువ్వుతాము; తప్పదు.

దేశికాచారి

మళ్లీ రంగనాథుడు తనమహత్తు చూపించాలి. అందాకా ఒప్పుకోము. ఆమాట నిజమే.

వేదాంతం

దినమూ రంగనాథుణ్ణి పూజించే పూజారికంటె దూరాన్నుంచి రంగధాముని ఆలయ గోపురము చూచే మాలవాడికే భక్తి ఎక్కువ పుట్టుతుంది కాబోలు!

దేశికాచారి

రంగనాయకుల దయవల్ల భక్తే అగ్రవర్ణలక్షణమని బోధపడింది. ఈతరమువారి కుబుద్ధు లింతటితో అంత మొందినట్లే!

వేదాంతం

తరువాతి తరములవారు దీని నీతిని స్మరించు కోక ఆచారమునకు దాసు లౌతారు సుమా!

దేశికాచారి

రాజుగారు వస్తూ ఉన్నట్లు తూర్యధ్వనులు వినిపిస్తున్నవి.

వేదాంతం

ఇంకా పాణయ్యను వాళ్లు తేలేదు. ఏమి చేస్తున్నారో ఈమాలవాళ్లు ఇంత సేపటినుంచీ!

దేశికాచారి

ఈనాడు పాణయ్య హృదయపుష్పాన్ని రంగనాథుడి పాదపద్మాలమీద అర్పిస్తాడు.

వేదాంతం

ఇదివరకే చేశా డాపని. పాణయ్యకులమువారికీనాడు రంగధాముడి దర్శన భాగ్యము లభిస్తుంది. రంగధాముడి కటాక్ష వీక్షణములలో స్నానము చేస్తారు వారు.

దేశికాచారి

వైష్ణవాగ్రగణ్యు లవుతా రీరోజున వారు. అరుగో అరుగో, పాణయ్యను వాళ్లు లాగుకు వస్తున్నారు.

వేదాంతం

ఆగోచీగుడ్డతో వాడిని రాజుగారి యెదుట ఎలాగ పెట్టడం?

దేశికాచారి

ఆభక్తశిఖామణికి ముస్తాబు ఎందుకు?

వేదాంతం

భక్త్యావేశమే అతని ముస్తాబు.

[మూలయ్య, పుట్టయ్య, పాణయ్య ప్రవేశం.]

పాణయ్య

వదలండి నన్ను వదలండి. నారంగడిదగ్గిరికి నే వెళ్లిపోతాను నన్ను వదలండి నన్ను వదలండి. ఏడీ నారంగడు ? ఏడీ, ఏడీ, ఏడీ ? కావేరీనది గట్టున కూర్చున్నాడు నారంగడు. నన్ను రమ్మంటున్నాడు. నే వెళ్లిపోతా. నారంగడి దగ్గరికి నే వెళ్లిపోతా.

పుట్టయ్య

ఉండరా పాణయ్యా, ఎందుకు పెనుగులాడతావు? నీకోసం బ్రాహ్మణయ్యలు వచ్చారు చూడరా.

పాణయ్య

వచ్చారా నారంగళ్లు వచ్చారా! నాకోసం వచ్చారా నారంగళ్లు; నారంగళ్లకి నన్ను చూస్తే ఎంతదయ; నారంగళ్లు నన్ను దేవాలయం కట్టుకోమని నాకు రాళ్లు ఇచ్చారు కాదూ? నారంగళ్లకు మొక్కుకొంటాను.

ఏరీ నారంగళ్లు?

[అంటూ వైష్ణవుల పాదాలమీద పడును.]

వేదాంతం

ముట్టకు ముట్టకు. [అని దేశికుణ్ని చూచి నాలుకకరచుకొని]

లే, పాణయ్యా, లే; నీకోసం రాజుగారు వస్తున్నారు.

దేశికాచారి

నిన్ను రంగనాయకులదగ్గిరికి రాజుగారు స్వయముగా తీసుకువెళ్లుతారట; అదుగో, రాజుగారు వస్తున్నారు.

పాణయ్య

[సంతోషంతో గంతులువేస్తూ]

నన్ను రంగనాథుడిదగ్గిరికి తీసుకువెళ్లుతారా! రాజుగారు వస్తున్నారా! నా రంగనాయకుణ్ని దేవాలయంలో నేను చూచుకోవచ్చునా, నేను కొలుచుకోవచ్చునా,—నారంగనాయకుణ్ని?

దేశికాచారి

ఆ! సందేహం లేదు!

వేదాంతం

నిన్ను చూస్తే రంగనాయకుడికి చాలా ప్రీతి.

పాణయ్య

రాజుగారు ఎందుకు పిలవడం నన్ను? నాకిక్కడ నారంగనాథుడు లేడూ? నా కీరంగడు చాలడూ? నారంగడు కావేరీతీరాన్ని ఇసుకతిన్నెలమీద ఆడుకొంటున్నాడు. నేను నా రంగడిదగ్గిరికి వెళ్లిపోతాను. నారంగణ్ని నేను కొలుచుకొంటాను.

దేశికాచారి

నీవు వెళ్లిపోకు. రాజుగారికి కోపం వస్తుంది.

వేదాంతం

నీవు వెళ్లితే నిన్ను శిక్షిస్తారు సుమా.

పాణయ్య

నాకొద్దు దేవాలయంలో రంగన్న! ఆ రంగడు బ్రాహ్మలరంగడు. నే నాఆలయంలోకి వెడితే బ్రాహ్మలకి కోపం రాదూ! బ్రాహ్మలకికోపం వస్తే నాకు పాపం రాదూ! బ్రాహ్మలకి కోపం వస్తే నారంగడికి నామీద కోపం రాదూ! నాకీ రంగడే చాలు. నారంగన్నతోనే నే నాడుకొంటాను. నారంగన్ననే కొలుచుకొంటాను.

దేశికాచారి

నీవు దేవాలయంలోకి వస్తే బ్రాహ్మలకి కోపం రాదు. వెయ్యిమంది బ్రాహ్మలు రాజుగారి వెంట వస్తున్నారు నిన్ను తీసుకువెళ్లడానికి!

వేదాంతం

రంగడునిన్నుతీసుకురమ్మనివారితోచెప్పాడుట.

పాణయ్య

బ్రాహ్మలే వస్తున్నారా నాకోసం? అమ్మో, బ్రాహ్మణదేవుళ్లు మా ఇంటికి రావచ్చా? రంగడు నన్ను తీసుకురమ్మన్నాడా? నిజంగా, నిజంగా? నారంగడే నన్ను తీసుకురమ్మంట? నారంగడే?

దేశికాచారి

రంగడిఒంటికి నిన్ను కొట్టిన దెబ్బలు తగిలాయిట!

పాణయ్య

ఎవరి ఒంటికీ?

వేదాంతం

శ్రీరంగనాయకులవారి ఒంటికి.

పాణయ్య

ఎందుకు తగిలాయి?

దేశికాచారి

మేము నిన్న రాళ్లతో కొట్టాము కామా? ఆదెబ్బలు రంగడికి తగిలాయిట.

పాణయ్య

అయ్యో, అయ్యో, మా రంగడికే దెబ్బలు! నాకెందుకు తగిలేయికావు ఆ దెబ్బలు? నా ఈ పాపు దేహానికి తగిత్తే అది భగవదారాధనకు స్వాధీనమయ్యేదే! నా రంగడికి దెబ్బలు తగిలాయా? అయ్యో, అయ్యో! [ఏడ్చును.]

దేశికాచారి

రంగడు రాజుగారికి కలలో కనిపించి నిన్ను దేవాలయంలోకి తీసుకు రమ్మన్నాడుట!

పాణయ్య

నిజంగా, నిజంగా?

దేశికాచారి

నిజమే.

పాణయ్య

మా రంగయ్య నన్ను తీసుకురమ్మంట నిజమే?

వేదాంతం

నిజమే.

పాణయ్య

మా రంగడు నన్ను దర్శనం చేసుకోమన్నాడా? నిజంగానే?

పుట్టయ్య

నిజంగానే.

పాణయ్య

శ్రీరంగనాయకులవారికి ఎంతటి ఆశ్రిత పక్షపాతం! నన్ను రమ్మన్నారా? నన్ను రమ్మన్నారా? నన్ను రమ్మన్నారా? నిజంగానే?

మూలయ్య

నిజమేనటయ్యా!

పాణయ్య

నారంగయ్య నన్ను దేవాలయంలోకి రమ్మన్నాడు. నిజమే. నిజమే. ఇన్నాళ్లకి నా దేవుడిదర్శనం నా కవుతుంది. ఇన్నాళ్లకి నేను కరువుతీరా నా రంగణ్ణి చూచుకొంటాను. రంగణ్ణి చూడని ఈ కళ్లెందుకు నాకు? రంగణ్ణి మొక్కని ఈచేతు లెందుకు నాకు? రంగణ్ణి పలకని ఈ నాలుక ఎందుకు నాకు? రంగణ్ణి తలవని ఈ హృదయ మెందుకు నాకు? నారంగణ్ణి నేను మనసారా కొలుచుకొంటాను. నా రంగడు నన్ను రమ్మన్నాడు. బ్రాహ్మలు రంగణ్ణి చూడమన్నారు నన్ను. రాజుగారు రంగణ్ణి చూడమన్నారు నన్ను. నా రంగడే నన్ను రమ్మంటున్నాడు. నేను వెడుతున్నా! నేను వెడుతున్నా! నారంగడికోసం వెడుతున్నా! నా రంగడిని చూచుకొంటాను. నారంగడిని కాంకించుకొంటాను. నారంగణ్ణిపూజించుకొంటాను. వెడుతున్నా నారంగడిదగ్గిరికి. రంగా, రంగా, నాతండ్రీ, ఓరంగా! వస్తున్నా తండ్రీ, నీఒళ్లోకి. వస్తున్నా నాయనా, నిన్ను మొక్కుకోడానికి! వస్తున్నా ప్రభూ, నీ పాదాలదగ్గిరికి! వస్తున్నా రంగా, వస్తున్నా, రంగా, రంగా.

[అని వెళ్లిపోవును.]

దేశికాచారి

రాజుగారు వాద్యములతో వస్తున్నారు. ఆగు పాణయ్యా ఆగు.

వేదాంతం

వెయ్యిమంది బ్రాహ్మలతో కూడా వస్తున్నారు.

పుట్టయ్య

ఆపేదా, బాబూ వాణ్ణి?

మాలయ్య

పరుగెత్తుకువెళ్లి పట్టుకోమన్నారా?

దేశికాచారి

పట్టుకోండి పట్టుకోండి.

పుట్టయ్య, మాలయ్య

ఆగరా పాణయ్యా, ఆగరా, ఆగరా.

[అని పరిగెత్తి పోతారు.]

వేదాంతం

మరి వాణ్ణి వీళ్లు పట్టుకోలేరు? మనం ఇక్కడ ఉందామా? వెళదామా?

దేశికాచారి

రాజుగారు వస్తారుగా! వారికీ వర్తమానం చెప్పవద్దూ? ఆగుదాము లే.

వేదాంతం

చూడు చూడు. వాడు మాలపల్లిలో జనాన్ని అందరినీ తీసుకుపోతున్నాడు రంగనాయకుల గుళ్లోకి! గంతులు వేస్తున్నాడు! పాటలు పాడుతున్నాడు! మాలవాళ్లందరూ అతనితో కలిసి పాడుతున్నారు!

దేశికాచారి

వెయ్యిమంది బ్రాహ్మలూ వాణ్ణి చుట్టవేసి పట్టుకొన్నారు చూడు చూడు. ఔరా, ఆశ్చర్యం! వాడిపాదాలకు మొక్కుతున్నారు, వారంతా!

వేదాంతం

మన మెంత తప్పు చేశాము! వాడి పాదాలకి మొక్కవలెననే తోచింది కాదు మనకు!

దేశికాచారి

అది మన దౌర్భాగ్యం. పూర్వకృత కర్మదాటడం ఎవరి శక్యం.

చూడు చూడు. వాడిని రాజుగారి రథంలో రాజుగారిపక్క కూచోబెట్టారు. రాజుగారు అతన్ని కౌగలించుకొంటున్నారు.

వేదాంతం

పాణయ్య రథంలో మూర్ఛపోయాడు, చూడు.

దేశికాచారి

ఓహో, ఎంతటి దివ్యదృశ్యము! ఎంతటి పుణ్యదినము! అనంతకాలములో ఈ ఒక్కదినమూ ఎంతటి పుణ్యదినము! మాలలూ బ్రాహ్మలూ కలిసిమెలిసి రథంవెనక శ్రీరంగనాయకుల దేవాలయానికి వెళ్లుతున్నారు చూడు.

వేదాంతం

మాలలు పాటలు పాడుతున్నారు. బ్రాహ్మలు స్వస్తి వాచకములు చెప్పుతున్నారు. రంగడి పేరు మిన్ను ముట్టుతోంది.

దేశికాచారి

వెళదాము పద. మనం మాత్రం ఇక్కడ ఒక్కళ్లమూ ఉండడ మెందుకు. రంగడి ఉత్సవములో మనమూ కలుద్దాము.

వేదాంతం

పద. చప్పున పద.

# కృష్ణరాజసాగర చిత్రములు



౧. కృష్ణరాజసాగరము ఆనకట్ట-లోపలిభాగము



౧. కృష్ణరాజసాగరము అనకట్ట తూముఃనుండి ప్రవహించుచున్న కావేరినది



౨. కృష్ణరాజసాగరము అనకట్ట-వెలుపల, లోపల



౮. కృష్ణరాజసాగరము ఆనకట్టయొక్క అద్భుత నిర్మాణము

చెలుకుపల్లి శివరామయ్య గారు (వాణీ సేవాసంఘము)

అంబుజకేళికాయతనమందుఁ బ్రియాంగనగూడి రాత్రి సౌ
ఖ్యంబుల నోలలాడి యుదయంబున లేతుమటన్న భ్రాంతి డెం
దంబునఁ బుట్టదేల? కుముదప్రతతుల్ ముకుళింపఁజొచ్చె; నీ
యంబుజవల్లభుం డుదయమయ్యెడు వేళగు లెమ్ము భృంగమా!

రాతిరియంత నిద్దురపరాకున నున్నది చాల దోక్కా? నం
ప్రీతి విలాసినీ విరహవేదన లెల్ల నడంగఁ జొచ్చెఁ; బ్రా
భాతిక మారుత ధ్వనులపార ముదావహమై జగజ్జన
వ్రాతము నెల్ల మేలుకొలుపంగఁ దొడంగెను లెమ్ము భృంగమా!

వారిజబాంధవుం డెదుటవచ్చి హసించిన జేలవౌదు వా
ర్యాయరము మీఱఁగా మధుకరాంగన ముందుగ మేలుకాంచి ఝుం
కార మనోజ్ఞగీత రసగానములన్ నిను నిద్రలేప కా
సార విహార కౌతుకవశంబున నీ దరిఁజేరు భృంగమా!

కమలాసక్తమరందపాన వశతన్ గాయంబు మూర్ఛిల్లెనో!
కమలానందన బాణవేదనకు మైకంపించెనో! లేక దు
ర్దమవేదండ విశాలకర్ణహతి చేతన్ స్రుక్కెతో! నిందు నీ
రమణీరత్నము నీవిలంబనము: నోర్వంజాలునే భృంగమా!

నీమోహాతిశయంబె సౌఖ్యయుతమున్ నీ సన్నిధానంబె స్వ
ర్గామోదంబని నీదు దర్శనమె సర్వాభీప్సితార్థంబుగన్
నీమాధుర్య సుధామయోక్తులె జగన్నిక్షేపమం చెంచు నీ
భామారత్నము నాదరింపుమ సతీవాంఛారతుల్ దీరఁగన్.

విమలాంభోరుహ పత్రభాజనములన్ విందారగింపంగ మో
దముసన్ కమ్మని పుష్పాడిన్ భ్రమరకాంతల్ గూర్చి ఝుంకార గీ
తములన్ బాడెడువింతగాఁ బ్రకృతి మీదాంపత్యనైపుణ్యభా
గ్యములన్ గాంచి నుతింప విందు సలుపంగా రాఁగదే భృంగమా!

---

[ఈచిన్నికథ చాలకాలమునాటిది. ఇప్పటికిని దీనిని పాటగ ముసలమ్మలు పాడుచుండుట వినుచుందుము. ఆ పాట నాధారముగఁ జేసికొని కొలఁది మార్పులతో దీనిని వ్రాయుచున్నాను. కథ ప్రాతదగుటచేత ఇందలి భాషయు నించుక పూర్వసంప్రదాయానుసారముగ దిద్దికొంటిని. అందుఁగల యీ వైపరీత్యమును పాఠకులించుక మన్నింతురుగాక!]

౧

లేజవరాలి నెన్నడుముపైఁ దూఁగు యౌవనభారము ట్లింతసంచలించి, తీవకొనవంటి యూఁగి యాడు పరువంపు విరితెఱంగున నట్టిట్టై, పద్మపత్రంబుపై నటించు నీటిముత్తెము వడువున నిలుకడఁ దక్కి, మధుమానసమయబంభర ప్రకరంబు ప్రకారంబున వింతవింతగంతులిడుచుఁ జూలాలియెడంద క్షణవిరామం బెఱుంగక పట్టుదప్పి పరగడలఁ ద్రొక్కుచుండును.

ఆ నాఁటి యుదయమునఁ బన్నీట మజ్జనం బాడి, యొడలంటిన చలువతెరలోనుండి శరీరకాంతులు నీరెండతో వియ్యమంద, విరియఁ బోసిన పెన్నెఱులఁ గొనగోటఁ జిక్కుదీయుచు, గిలుకుటందియలు మెల్లన మ్రోఁగ సౌధాగ్రంబునఁ బచారుసేయుచుఁ దిరుమలాంబ యట్టె నిలిచి నిదానించి నిట్టూర్పు విడిచి గాలపురువ్వ వలెఁ జయ్యనఁ దన వాల్చూపుల రాజమార్గంబున నిగుడ్చి పిల్లయెలుంగునఁ బ్రియదాసియగు భ్రమరికం జేరఁ బిలిచెను.

తిరుమలాంబ యున్నత రాజకుటుంబమునఁ బుట్టినది. విద్యావతి. రూపవతియును, తొల్లి చంద్రశేఖరు లావణ్యంబుఁ జూచి. యాతఁడు సామాన్య రాజకుటుంబములోనివాఁడని యెఱింగియు వానియెడ వలపగ్గలంబగుడు నిజజననీముఖంబున జనకు నియ్యకొలిపి మనసార వానిఁ బెండ్లియాడినది. తనమనోహరునితోఁగూడ సవిలాసముగఁ బ్రణయప్రవాహ తరంగమాలికల డోలిక లూఁగుచు జగంబు మఱచి మఱచి నేఁడంతర్వత్నియై యున్నది.

అట్లు చేరవచ్చిన భ్రమరికకుఁ గొనవ్రేల రాజమార్గంబు తలనున్న యొక యువతిం జూపుచు, "నెచ్చెలీ! కనుఁగొనుము! గుబురులు గుబురులుగఁ జిగిరించు మాధవీలత మాడ్కి వడవడవడంకు నెన్నడుముతోఁ గూరాకులు మోసికొనివచ్చు నాజవరాలు! లలితరూపవిలాససంపదలఁ గలకలలాడు నీమె యెంతమనోహారిణియై విరాజిల్లుచున్నది! ఆమె మునువ్రేళ్ళనంటిన కూర యెట్టిరుచుల నీనునో. నీ వవలీల నందు జని యమ్మందగమన నింకఁ దోడ్తెమ్ము. ఆకూరఁ దిన నాకు మనసగుచున్నది." యనియె. భ్రమరిక యించుక యోచించి యిట్టు

లనియె: "ఆయువతి విక్రయించునది నెల్లికూర. ఆకూరఁ దినవలసినవారు వేరు. నీవు రాజపత్నివి! అగర్భ శ్రీమంతురాలవు! ఆకలములు దిన మన సెట్లు పోయినది? అదియునుంగాక యిట్టివేళ నిన్నే భ్రమింపఁజేసిన జవరాలి నంతిపురముఁ జేరనీయఁవచ్చునా?" అనుటయుఁ దిరుమలాంబ భ్రమరికను బొమముడితోఁ జాఱచుఱ జూచి, "ఆకూర నేఁడు తినకతప్ప" దనెను. రాజపత్ని! అందును గర్భవతి! ఆమె కోరునది కాదనువా రెవ్వరు? వల్లెయని భ్రమరిక పరుగుపరుగునఁ బోయి యా నెల్లికూర నమ్ము నెలంతం దోడ్తెచ్చె.

ఆయువతి సౌధద్వారము కడ నిలిచి చిఱునవ్వు మోమునఁ జిందులాడఁ, జిక్కులువడ్డయలకలు ఫాలమున నటింప శిరం బట్టిట్టెంచుక యూఁచుచు, "నెల్లికూరో" యని కేకవెట్టునంతఁ దత్పరిసరంబుల నెల్లవసంతోదయ మయినట్లయ్యెను. ఆమెలావణ్యచ్ఛాయను జెఱకువిల్లెక్కువెట్టి విరివింటివాఁడు గుఱికై తొంగి తొంగి చూచుచుండెను. లోపల జలకమాడి తడియొత్తికొనుచున్న చంద్రశేఖరుఁ డాకూఁత విని నివ్వెఱఁగంది గవాక్షమునుండి బయలు చూచెను. నీలాకాశంబున నిగనిగలాడు చంద్రబింబంబుపగిది, కార్కొన్న పొదలోని పూలగుత్తివోలె, బయల్వడ్డ గవిలోని పద్మరాగంబు చందంబునఁ దత్ప్రదేశంబు ననన్యసామాన్య కాంతుల వెదఁజల్లు నయ్యింతిం గనుంగొని యాతఁడు విస్మయంబున బ్రమాన్పడి విశాలములయిన తన కనురెప్పలఁ జలింపనీక యామెం జూడఁ జొచ్చెను.

సౌందర్య మేరి నాకర్షింపదు? సృష్టిసౌందర్యముం జూచి కవికులము గానమొనర్చుచున్నది. పుష్పసౌందర్యముం జూచి పుర్వులు సైతము సమాధింబడి రెక్కలఁ దాల్చి త్రుళ్ళింత లాడుచున్నవి. సంధ్యాసౌందర్యముం జూచి పులుంగు లెలుంగెత్తి పాడుచున్నవి. ఉదయారుణ సౌందర్యప్రభలలో మందమారుతము కావ్యతరంగమాలికలఁ గడలు కొల్పుచున్నది. యువతీసౌందర్యమునఁ గరంగని పురుషుఁ డుండునా? అకూరపడుచు ప్రసరించు సౌందర్యప్రసారమాలికల డోలిక లూఁగుచు మరుండు క్రీగంటఁ జంద్రశేఖరుం జూచి, డిగ్గన దిగి, చెఱకువిల్లు సంధించి యాచెలువముంగలఁ గల నెల్లిగంప మఱుంగున వంగి యాలీఢపాదస్థుఁడై నవమల్లికాశరంబుం బూన్చి చంద్రశేఖరుని హృదయసీమ గుఱిచేసెను. ఆ నెల్లిపాపయు మల్లికామాలికల వెల్లిగొలుపు తన నల్లలితదృగ్వల్లుల నల్లనఁ జంద్రశేఖరునిపై విరఁజల్లె. గర్భిణీస్త్రీలకువలె రాజులకుఁ గూడ మనోవికారంబులు విపరీతంబులై యుండునని పెద్దలు చెప్పుదురు. అనుభవాకాంతుం దగిలి ప్రవర్తిల్లు మానవహృదయమునకు ధనము ముఖ్యాధారము. తత్కటాక్షంబునం బ్రవర్ధిల్లు రాజుల మానస మదగజంబులకు వెడలినదే వీథి!

చేటకొమ్మునఁ జేరెడు చీరుముత్తెముల వెలపోసి భ్రమరిక నెల్లికూరఁ గొనవచ్చినది.

సౌధాంతరమునుండి చెక్కిటఁ జేయి వెట్టికొని రెప్పవాల్పకుండఁ దిరుమలాంబ నెల్లిపాపఁ జూచుచున్నది. ఆమె మునువ్రేళ్ళ నంటి యుడ్డ నెల్లికూరఁ జూచి యువ్విళ్ళూరుచున్నది.

౨

పశ్చిమాశాతరుణీ ముఖంబును దరణి సింధూరరేఖ లిడి యలంకరించుచున్నాఁడు. సన్నజాజితీవియకన్నె, మావిగున్నపై విరితలఁ బ్రాలఁ బోయుచున్నది. పొన్నవలకాని మాధవీలతిక బిగియారఁ గౌఁగిలించుకొనుచున్నది. మాలతీ కురుంగము మందానిలరసికునితో గుసగుస లాడుచున్నది. మల్లె పొద సుమరదనంబుల విచ్చి తూరుపుకొనఁ దొంగి చూచు చందమామను బలుకరించుచున్నది. ఆసాయాహ్నసమయమున నవ్వనసీమను శృంగారదేవత చిఱుమువ్వలు సందడింప నృత్య మాడుచున్నది. ఈ పొదరింటఁ గోక సవరించి కట్టికొని యా మ్రానిక్రింద నిట్టూర్పు విడిచి, చెక్కులఁ బొడము చిఱుచెమ్మట ముత్తెములఁ గొనగోటఁ జల్లులాడుచు మాగన్నువడు కన్నురెప్పలను బ్రయత్నమున విదలించికొనుచు, నెఱ్ఱవడిన మోముతో మందమంద గమనంబున వెన్నెల పాలమడుంగున నీఁదులాడు రాజహంసివలెఁ దన పర్ణకుటీరమును డాయవచ్చు నామెయే మన నెల్లిపాప! పర్ణశాలను జేరవచ్చిన కొలంది నామెయడుగులు తడఁబడుచున్నవి. చూడ్కు లానందమునఁ దళతళలాడుచు బెగడున వెడవెడ లాడుచున్నవి. ఎట్టకేలకు తన గృహంబును జేరి యానెల్లిపాప బెదరున నల్గడలఁ బరికించి యింటఁ దనతల్లి తక్క నన్యులు లేకుంట నెఱింగి వెడవెడ చూపులతో గద్గదిక సవరించికొని విన్నఁబాటున నోరమోమిడికొని ముంగొంగు కొనవ్రేళ్ళఁ జుట్టికొనుచు 'అమ్మా' యని పిలిచి మిన్నకుండెను. తల్లియు కూఁతుముఖవైఖరిం జూచి దీప మెగఁద్రోసి తీక్ష్ణదృష్టులఁ దనయ నెగాదిగ నుపలక్షించినది. పెదవుల ముడిచికొని మూతి బిగించికొని తల యూఁచినది. తెగిన క్రోవలోని ముత్తెములవలె నాదీపపు వెలుంగున వింతవింత కాంతుల నీనుచు నెల్లిపాప కనులనుండి నీటిబొట్లు బొటబొట రాలినవి. కట్టతెగిన ప్రవాహజలమువలె వెక్కువెక్కుల నామె యూర్పులం బుచ్చినది. భోరుమని యేడ్చుచు నెట్టకేలకుఁ గేలు సాఁచి నెల్లిపాప తన తల్లి కంఠంబును గౌఁగిలించికొనినది!

భగవంతుని కనురెప్పలలోని సృష్టివలె, ముత్తెపుచిప్పలోని నీటిబొట్టు పోలిక, హితుని హృదయంబున రహస్యంబువడువున, మారుత తరంగములలోని సౌరభంబు తెఱంగునఁ దల్లి కౌఁగిటఁ దనయ నూతన సౌభాగ్యంబున విరాజిల్లును.

* * * *

తెలతెల వాఱుచున్నది. నెల్లిపాప మనోవీథిని నూతన ప్రణయప్రభలు ప్రాఁకుచున్నవి. దిక్కులఁ బక్కుల మధురాలాపములు పిక్కటిల్లుచున్నవి. నెల్లిపాప హృదయప్రదేశము

పుట్టువు మఱచెఁ గాఁబోలు! మఱవదా? విరితేనె మరంగిన భ్రమరము తన తొంటి గతిఁ దలంచునా? ఇట్లు ఐశ్వర్యపరవశయై పర గడలు ద్రొక్కుచున్న దీని కించుక హితబోధఁ గావించెదం గాక" యని తిరుమలాంబ "భ్రమరికా" యని తన ప్రియదాసింబిలిచి యేమేమియో యామెకుం జెప్పి పుత్తెంచె.

౪

అది రాజాంతఃపురములోని భోజనశాల. ఆ శాలకు నడుమ నొకతెర వైవఁబడియున్నది. అవ్వలిభాగమునఁ దిరుమలాంబ భుజింప నీవల నెల్లిపాప యాహారించుచుండును. చుట్టగుడ్డపయిని గూర్చుండి యెడమచేత నంజుడు గొఱుకుచుఁ గుడిచేత మలకలోని యంబలి జుఱ్ఱుకొనుచు లొట్టలువైచు నెల్లిపాప నేఁడు పట్టుదిండ్ల పీటపైఁ గూర్చుండి బంగరు పళ్ళెరమున నిడ్డ పక్వాన్నముల నారగించుచున్నది. ఇదియు యదనని వంటలక్కయు నొకానొక కూరం దెచ్చి యామె పళ్ళెరమునం బెట్టెను. నెల్లిపాపయు నాకూరఁ దన మును వ్రేళ్ళ నంటి నాల్కకు రాచికొని యొడలించుక జలదరించికొని వంటలక్కం జురచురం జూచి, "ఇదియేమికూర? ఎవ్వరు దీనిని వండ నియమించిరి? ఇంత వెగటుకూర నెవరైనఁ దిందురా?" యని గద్దించి యడిగెను. అవ్వల తెరలోఁ గాచికొనియున్న తిరుమలాంబ నెల్లిపాప చిడిముడిపాటు విని, "చెల్లెలా! కోపింపకుము. ఆకూర వండ నేనే నియమించితిని. పాప మాకూర నేఁడు నీకు వెగటై తోఁచినదా! ఆ కూరపేరయిన నీ వెఱుఁగవు గాఁబోలు! అయిన నేమాయె. నేను నీకు దానికథ సవిస్తరముగఁ దెల్పెద నాకర్ణింపుము.—

చిక్కులుగొన్న నీ చికురాలలోన
మణిభూషయై తొల్లి మలసిన నెల్లి-
మాసిన నీకోక మడతలలోన
ముత్తెంపుటంచులై మురిసిన నెల్లి-
వాడిన నీగండభాగమ్ము నంటి
మకరిక లిడ్డ కమ్మని లేఁత నెల్లి-
మలినహా నీసోగమై నాశ్రయించి
గొజ్జంగివాసనల్ గురిసిన నెల్లి-
మఱచితే! నేఁటి సంపదలోనఁ జెల్లి!

* * * *

కోల చేకొని పెద్ద కొమ్మల వంచి
కూరిమి నీయన్న కోసిన నెల్లి-
నకినకలాడు నెన్నడు మెత్తకుండ
వంగి నీతల్లి కుప్పగ నిడ్డ నెల్లి-
ముంజేతు లలయుంగ మోపులు గట్టి
నీచెల్లి లలి గంప నింపిన నెల్లి-
తట్టల నెత్తి యాదలఁ దాల్చి తొల్లి
వాడవాడల నీవు పాడిన నెల్లి-
మఱచితే నేఁటి సంపదలోనఁ జెల్లి!

* * * *

సౌధాంతరమునుండి చల్లని వేళ
ప్రేమమై నేఁ జేరఁ బిలిచిన నెల్లి-
చేట కొమ్మున మంచి చీరుముత్యాలు

వెలఁబెట్టి నాదాసి నిలిచిన నెల్లి-
యలవోక మన్మనోహరుని హృద్గుళిక
గిలకొట్టి కరఁగించి కెరలిన నెల్లి-
యవలీల నీదైన్య మణఁగించి మించి
నిను భోగములలోన నిలిపిన నెల్లి-
మఱచితే? నేఁటి సంపదలోనఁ జెల్లి!"

---

## భావిదృష్టి

శ్రీ. శ్రీనివాసరావు గారు (కవితాసమితి)

అట కవితాప్రపంచము లహర్నిశమున్ రసవన్నవీన వి
స్ఫుట నటనాప్రసక్తిమెయి సోలును, తేలు ననంతహర్షపున్
ఘటికలలో సహస్రరవికాంతులు మేదురరమ్యవర్ణ సం
ఘటనముకూర్చి నాకదియె కావ్యపథమ్ము భవిష్యదాశలన్.

నాతలపోతలీక్షణము నన్ పరువెత్తు నదృశ్యపతత్ సం
పాతముతో రయోద్ధత సుపర్వ విమానపలాయనక్రియా
తీతములై సుధామధురదివ్యపథాలకు, భావికాల వి
ద్యోతిత నాట్యశాలలకు, జ్యోతిరఖండ యశోంగణాలకున్.

భావి వికాస వాటికల బాటలలోచను నాకు నాకవి
తావృత గీతులే వినగనౌను చెఁద్గరుదంచలమ్ములై!
దైవధునీప్రసన్నసికతాస్థలులన్ విహరించు నాకు నా
పూవులపాటలే వరదవోవును తేనియ తేట యూటలన్!

నే నిపుడే నదించిన అనేకరహస్స్మృతిం లాలకించగా
లేని జగత్తులో ప్రతిఫలించదు నాహృదయమ్ము నేడు; సం
ధ్యానిశితారుణ ప్రభలు దాచిన యామినిలో చరించు నా
మానసమింక భావి సుషమావికసద్రుచు లాస్వదించెడున్.

---

౧

ఓ శృంగారీ! అట్టె గర్వపడకు. విరాగి పాదములకడఁ గూర్చుండి ప్రేమపాఠములు చదువు. అతనిభక్తినుండి బయలుదేరు ప్రేమ తరంగములు నిన్ను ముంచి యెత్తఁ గలవు.

౨

ఈశ్వరునితోఁ పనిబడుచోఁ మీ రాచారములు బంట్లు. కానిచోఁ ఆచారములకు మీరే బంట్లు.

౩

లోకమునఁ బసుఁబాపలు ముదివగ్గులే తమాషా. వారియం దీశ్వరప్రతిబింబములు కానిపించును.

౪

వ్యాకరణము భాష - పిట్టు. వేదాంతము మనస్సు - పిట్టు. సాధనలోఁ సార మున్నది.

౫

నీమీఁద దృష్టి యుండుచోఁ సంశయు నీమయమే. నీమీఁద దృష్టి లేనిచోఁ సంశయు సమోహమయమే.

౬

ఓయీ, నాసికాగ్రమున దృష్టి నిలుపుట కొన్నియేండ్లు నేర్చితివి. ఇఁక నాసికాగ్రమే యీశ్వరుఁడై పోవుఁ జుమీ.

౭

ఎఱుఁగక చేయు నాత్మార్పణముకన్న ఎఱిఁగి చేయు తిరస్కారము మేలు.

౮

ప్రయాణములందు నిన్నుఁ దలపోయుచు నడవక యే ఊరు చేరుకొందును.

౯

నీతి నీ విభూతి.

౧౦

ధ్యానములోఁ రాయి, పనిలోఁ పాఱ.

౧౧

పద్మాసనమునఁ గూర్చుండి ధ్యానింపఁగా ధ్యానింపఁగా కాల మొక నిముసమేని కదలదు.

ఎఱుక లేదు; తలఁపు లేదు. మనస్సు మసకమసక.

ధ్యానపూర్తియేఁడ? వాసనా భావమేడ?

ఇట్టి యూఁటుఁ బోటులలోఁ నీ కొకతూరి మ్రొక్క లేవ నెంచి వంగి రెండుచేతులు నేల నిడి మోఁకారించితి. ఆ రెండు చేతులక్రిందను నీ రెండు పాదములును.

ఉన్నవా యని కనులు తెఱవఁగా నేవీ?

# నెహ్రూనివేదిక ఆంధ్రానువాదము

# రెండవకూర్పు వెలువడినది.

ఇట్టి యుత్తమ రాజకీయ గ్రంథ మిదివరలో వెలువడియుండలేదు. రాజ్యాంగవిధానమును తెలిసికొనఁగోరు ప్రతి ఆంధ్రుడును చదివి తీరవలెను.

## శైలి సులభము

కొలది ప్రతులుమాత్రమే మిగిలియున్నది.

వలయువారు **వెల 1-0-0 మాత్రమే తపాలాఖర్చులు ప్రత్యేకము**

మేనేజరు, ఆంధ్రపత్రికా కార్యాలయము, పోస్టుబాక్సునెం 212, మద్రాసు, అని వ్రాయవలెను.

# ఆంధ్రపత్రికా సంవత్సరాది సంచిక

ఆర్యా!

ఎప్పటిరీతిన రాఁబోవు ప్రమోదూత సంవత్సరాది సంచికను బ్రకటింపఁబోవుచున్నాము. అందు సారస్వత, సాంఘిక, రాజకీయార్థికాది విషయములను సంబంధించిన వ్యాసములు ప్రకటింపఁబడును. తాము పూర్వమువలెనే దయయుంచి అమూల్యములగు తమ వ్యాసములతో సంచిక నలంకరించి మాయుద్యమమునకుఁ దోడ్పడఁ బ్రార్థితులు.

ఈ సంచికయందువిషయవిభాగమును గావించి యేవిభాగమునకు సంబంధించిన వ్యాసముల నావిభాగమునందే ముద్రించి సంచికను ఉగాదినాఁటికి ఆంధ్రుల కర్పింపఁ దలఁచినాము. నియమిత కాలమునకుఁ బూర్వమే వ్యాసము లన్నియు మాకుఁ జేరినఁగాని అట్లు విషయవిభాగమును గావింప ననుకూలము గానేరదు. సంచికాముద్రణ మారంభించినపిదపఁ బంపు వ్యాసములను సంచికయందుఁ జేర్చుటకు వీ లుండదు. కావున వ్యాసములు 1929 నవంబరు 15 వ తేదిలోపల మా కందవలెను. ప్రతి వ్యాసమునను, 'సంవత్సరాది సంచికకు' అని వ్రాసి యుంచవలెను. వ్యాసములును, వానికి సంబంధించిన చిత్రములును, ఇతరచిత్రములును, సంపూర్ణవివరణములతో నియమితకాలమునకుఁ బూర్వమే మాకుఁ బంపుదురుగాక యని ప్రార్థించుచున్నాము.

[illegible]

కాశీనాథుని నాగేశ్వరరావు,

ఆంధ్రపత్రికాధిపతి.




మైసూరు దసరా ఎగ్జిబిషనులో అమృతాంజన ప్రదర్శనము




మైసూరు దసరా ఎగ్జిబిషనువారు ఇచ్చిన యోగ్యతాపత్రము


AMRUTANJAN

౧౨

ఓ దేవా! ప్రతిధ్వానమును ఏల విలాపాంతముగాఁ జేయుదువు? నీ కావ్యమునకు శోకమే రసమా?

౧౩

మనుజుఁడు నియతకాలములఁ దినుటకుఁ బండుటకుఁ జదువుటకా యిటకు వచ్చెను?

౧౪

ఊఁదుటచే నీ యుదరము తిత్తి, దీనిని గమ్మర వాని దాఁగటికిఁ గొంపొమ్ము.

౧౫

ఆలోకించితి నను ఆనందముపాలైనను జేయుము, కనుఁగొనలేకపోతినే యను కాటియపాలైనను జేయుము. రెంటికిఁ జెడిన రేవడ జేయవలదు.

౧౬

నా యాశకు మితియు, మేరయు లేదు. ఒక్కచూపులో నీ సృష్టి నంతయుఁ జూడవలయు.

౧౭

కవితాగానముకొఱ కేల తొందర? ముందీ జీవగానము చూడు!

౧౮

ప్రపంచ మొక అద్దాలమేడ. అందెక్కడేని నీ ప్రతిబింబములే.

౧౯

బుద్ధి యంతటి బుద్ధిహీనమైన దేది? ఒక్కనాఁ డేమఱుచో నీవు మొదటికే వత్తువు.

౨౦

మనస్సు సుఖదుఃఖముల కద్దుడు కాకితము.

౨౧

దైనందినము పీఠికతోడనే సరి. గ్రంథారంభము కానరాదు.

౨౨

నన్నర్చనలో నారతి యెత్తు విగ్రహముగాఁ జేయుము.

౨౩

నేను నీ పిచ్చివాఁడను.

౨౪

ఇది యొక ఘోరసంగ్రామము. ఓడుదునని మది యూరకుండదు. అందీ యందక నీవు బుజ్జిచ్చి పెట్టకయు మానవు.

౨౫

సాధన నీ సామ్రాజ్యము.

---

# అజాతశత్రువు

విద్వాన్ కే. వి. కోటిలింగం దేవరగారు

గీ. ధర్మ భంగముల్గా జీవితంబు గడపి,
ధర్మ పన్నముల్ విని మెచ్చు ధర్మరాజో?
ఆత్మజీవితచరిత లక్ష్యంబు గాఁగ,
ధర్మమతబోద్ధ యైన య ద్ధర్మరాజో ?
"ఎవఁడజాతశాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. హక్కు లేని రాజ్యమునకై యుద్ధమైన
గద్దిగఱచి,దాయల నొంచు ఘనగుణుండో?
కరగతంబగు రాజ్యసౌఖ్యముల వీడి,
పరులకై సన్న్యసించిన పావనుండో? ౨
"ఎవఁ డజాతశాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. స్వగురుబంధుప్రజాక్షతజాభిషిక్తుఁ
డై, వెనుక తపియించు సపశ్చాత్తప్తమతియొ?
యూర్ధ్వరేతస్కుఁడై యాశ నుత్తరించి
ప్రజలభవబంధ దుఃఖముల్ బాపుజినుఁడో?
"ఎవఁ డజాతశాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. పరులు చెరకిన వనితనే పట్టమహిషిఁ
జేసి సాధ్వుల నవమతి సేయు నతఁడో?
ఏకపత్నీ వ్రతుం డయి లోక మందు
సత్పతిత్వ ప్రభావంబుఁ జాటు బుధుఁడో?
"ఎవఁడజాత శాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. పటుతరాహంకృతికి వశవర్తనుఁ డగు
ఘోరహింసా విధాన విశారదుండో ?
వ్యష్టి జీవ ధనంబులు నష్టపఱచు
సర్వ జీవైక్య తత్త్వ ప్రచారకుండో ? ౫
"ఎవఁడజాతశాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. పరుల సొత్తును జూదంపు పణముఁ జేసి
యప్రతిష్ఠ నందిన కితవ ప్రవరుఁడో ?
తనదు జీవిత సౌఖ్యముల్ ధార వోసి
యెల్ల జీవుల సొత్తు రక్షించు ప్రభుఁడో? ౬
"ఎవఁడజాతశాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. భౌతికసుఖైకవాంఛ దబ్బఱలు గూసి,
గురుజనముల వంచించిన కుటిలమతియొ ?
తాత్త్వికసుఖైక వాంఛ సత్యము వచించి,
వంచనపటంబు మొదలంటఁ జించుదణియొ?
"ఎవఁడజాత శాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. చెనక నంతర్బహిఃస్థ్యధిష్ఠిరత లేని
నామమాత్ర స్థిరుండగు నటవరుండో ?
పటుతరాత్మయు విమల సత్త్వంబు కలిమి,
మారలోకవిజేతయౌ వీర వరుఁడో ?
"ఎవఁ డజాతశాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. పరకపోష్ణరక్తాశ్రువుల్ బలిగొనంగ,
స్వీయతృష్ణోపశాంతి గావించు వృకుఁడో?
ఆత్మబాధానుభవమె సౌఖ్యముగ నెంచి
జీవకారుణ్య రసవృష్టిఁ జిలుకు ఘనుఁడో?
"ఎవఁడజాత శాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"

గీ. పరమశాంత నైరాశ్యంబుఁ బ్రచురపఱచు
క్రోధమాత్సర్య దుష్ట ప్రలుబ్ధమతియొ?
సకలజీవులకభయ మొసఁగు ప్రసన్న
శుద్ధ సత్త్వ ప్రశాంత ప్రబుద్ధ మతియొ?
"ఎవఁడజాతశాత్రవుఁడో నీ వెఱుఁగవో కో?"





గాదేపల్లి రామమూర్తి గారు


౧

దామోదరరావు పాతికవేల రూపాయల యాస్తిపరుడు. కావుననే యాతడు సబ్‌రిజిస్ట్రారు పదవినుండి రిటైరగు కాలము సమీపించుచున్నను, తొలిభార్య కిరువురు పుత్రికలు, మలిభార్య కొకపుత్రుడు సంతానమున్నను, భార్యావియోగ తాపమున కోపజాలకున్న యాతనికి మరల నొకరు వెయ్యినూటపదునార్ల కట్నముతో పిల్ల నిచ్చి వివాహము జేసిరి.

మూడవ యిల్లాలు కాపురమునకు వచ్చిన నాలుగైదు వత్సరములకు దామోదరరావు రిటైరయి స్వేచ్ఛాజీవనము నేయుచు భార్యయందు సమితానురక్తుడై యానందముగ గాలము గడుపుచుండెను.

ఈదినములలో సాధారణముగ మనుజు లధికారపదవులం దుండి దోసెళ్ల కొలది వేతనము లార్జించుచున్నను, తేరసొమ్ము లంతకన్న నధికముగ నార్జించుచున్నను, నట్టింట మారు విస్తరి పడనీయక-స్వసుఖముల కైన సార్జితమునుండి చిల్లిగవ్వయును వెచ్చపడనీయక-పరమలుబ్ధులై కాలము గడుపుచుందురు. కొందఱు ద్రవ్యమార్జింపుచున్నపుడు కొంత యుదారబుద్ధితో నున్నను అధికారము హరీయనిన క్షణమునుండి పైతరగతివారితో జేకీభవింపుచుందురు. ఆ మేడయిండ్లు-ఆ గుఱ్ఱపుబండ్లు-ఆ సేవకపరివారములు- ఆ యపూర్వ సుకుమారములు-వారికిపు డక్కఱకురాని జంజాటములై-యనవసరవ్యయకారణములై-లేని పోని వేషములై-సోమరిపోతుదనములై-పరిణమించుచుండును.

దామోదరరా విట్టి తెగలో జేరక పుత్రిక లత్తవారి యిండ్లకును, బుత్రుడు విద్యాభ్యాసము నిమిత్తమన్యగ్రామమునకును బోవుటచే దాను, నర్ధాంగియు మాత్రమే యింటనున్నను, దేనికిని లోపము, భార్యకు భారము గలుగకుండుటకై వంట కొకబాపనక్క, యింటిపనుల కొకదాసి, యితరపనుల కిరువురు సేవకులు, నెచ్చటికైన బోవుట కొక పెట్టిబండి, యాత డుంచుకొనవలసివచ్చెను. ఉద్యోగవిశ్రాంతి లభించినను బొత్తిగ నిరావ్యాపకముగ నుండుట కాతని కిష్టము లేక పురమందిరమున మెంబరయి క్రమముగ నం దధ్యక్షపదవి సంపాదించి, యప్పుడప్పుడు సభలలో స్త్రీవిద్యావశ్యకత, ఘోషాదురాచారము, బాల్యవివాహనిషేధము, పూర్వాచారఖండనము మున్నగు వివిధవిషయములను గూర్చి యుపన్యసింపుచు పేరుప్రతిష్ఠలు సంపాదించుటకు దరుచుగ పాటుబడుచుండెను. మగడు వయసుమీరినవాడని లేబ్రాయపుటిల్లా లేవగించుకొనకుండ నాతడు నెరసిన మీసములకు దరుచుగ నల్లరంగు రాచికొనుచుండును. మీనాక్షి పడకకుర్చిలోని, కాలు నేలమోపనక్కఱలేకుండ సేవకులచే సమస్తోపచారములు సేయింపుచు, నాపెకు ముద్దినుసులగు చీరెలు, గోరిన నగలు, నడిగిన నవలలు,

ప్రబంధములు, నాంగ్లవార్తాపత్రికలు తెప్పించియిచ్చుచు, సంగీతవిద్యాభ్యాసమునకొక యుపాధ్యాయుని నియమించి విశ్రాంతికాలములం దామెచే కృతులు మున్నగు మనోహరగీతముల బాడించుచు, నామె మృదుమధుర గాత్రమునకు మిగుల నానందించుచు నెలలుదినములుగ, దినములు నిముసములుగ నాతడు కాలము గడపుచుండెను.

౨

ఒకనాటి సాయంకాల మల్పాహారమునకైన పిదప దమలపాకుల చిలుకలు చుట్టి భర్త కిచ్చుటకు మీనాక్షి సావడిలోనికి వచ్చుచుండెను. భర్త యెవరో యొక నూతన పురుషునితో సంభాషించుచున్నట్లు గానబడగ దటాలున రెండడుగులు వెనుకకు వైచి, యాత డెవ్వడై యుండునని పరికింప దొడగెను. భర్త పడకకుర్చీపై గూరుచుండుటయు, నానూత్న పురుషుడు తివాసిపై గూరుచుండుటయు, గుండనములు, శాలువయు ధరించియుండుటయు పరిశీలించి యాతడు వైదికుడనియు, వెనుకకు బోవలసినంత యగత్యము లేదనియు నిశ్చయించుకొని భర్తను సమీపించి యాతనికి దమలపాకులు, చెక్కలగుండ మున్నగునవి యొసగి, వారి సంభాషణము విన కుతూహలముగ నుండుటవలన నొకింతయెడపట నిలువబడియెను.

దామోదరరావు, నానూత్న పురుషుడు నప్పుడిట్లు సంభాషించుచుండిరి:

దామో—సరే! మీ కంత కుతూహల మున్నప్పుడు పురమందిరమున మీ రుపన్యసించుటకు నా కభ్యంతరము లేదు. నాకుమాత్ర మా శాస్త్రమున నమ్మకము లేదని చెప్పుచున్నాను.

నూ. పు—చిత్తము. తమవంటివారికి నమ్మకము గలిగించుటకే నే నుపన్యసింపగోరుట.

దామో—నలుగురైదుగురు పండితులకు జాతకము జూపించి, యే రెండుమూడు చిల్లరి విషయములనుగూర్చి యొ తప్ప ఉన్నదున్నట్లు సమగ్రముగ జెప్పజాలకపోవుట గ్రహించిన పిమ్మటనే నే నీ దృఢాభిప్రాయమునకు వచ్చితిని.

నూ. పు—తమ యవిశ్వాసమునకు రెండుకారణము లుండును. తమజాతకము జూచినవారు తగినవిద్యాపటిమ గలవారు గాక పోవచ్చును.

దామో—జాతక భాగములో పేరుగలిగి గొప్ప గొప్పవారి యొద్దనుండి యనేక యోగ్యతా పత్రికలు తెచ్చినవారు.



“వారిసంభాషణము......నొకింతయెడపట నిలువబడియెను”

నూ. పు—సమర్థులైన యెడల, తమ జననకాల ఘటికావిఘటికలు సరియైనవి గాకపోవచ్చును.

దామో—మాటవరుస కనుచుంటిని. మీరు జాతకము జూచి చెప్పునది గాకతాళీయముగ యథార్థమయినపు డది మీపాండితీవిశేషము, శాస్త్రసత్యమునా? అది తేలిపోయినపుడు జననఘటికాగణనదోషమా? శాస్త్రముమాత్రము యథార్థమని విశ్వసింపవలయునా! ఈమాటల యందేమైన న్యాయ మున్నదా? యుక్తి యున్నదా? చెప్పినవిషయము చక్కని నిదర్శనములతో ఋజువు చేయవలదా? వట్టిమాటలే నిదర్శనము లగునా?

అంతలో దాసి వచ్చి సంగీతోపాధ్యాయుడు వచ్చి నాడని చెప్పగ మీనాక్షి లోనికి బోయెను. ఒకయరగంట గడచిన పిదప నేదియో పనిగలిగి మీనాక్షి సావడికి వచ్చి తొంగిచూచునప్పటికి భర్తయు, నూత్నపురుషుడును పటాలున దమతమ యాసనములనుండి లేచి, ఆ! ఆ! యనుచు రెండుచేతులు నెత్తి యొకరి నొకరు గట్టిగ బట్టుకొను చుండిరి. వారి కేదియో తీవ్రకలహము వాటిల్లినదని తొట్రుపాటుతో మీనాక్షి దాసుగారూ! దాసుగారూ! యని బిగ్గఱగ నఱచెను. ఏమేమి! యనుచు జేతనున్న ఫిడేలుకమానుతో రంగదాసాక్షి పరుగున వచ్చెను. మీనాక్షి భర్తను, నూత్నపురుషుని వ్రేలితో నాతనికి జూపి భయముచే వడకిపోవుచు నించుక వెనుకకు బోయి నిలువబడియెను. దామోదరరావు, నూత్నపురుషుడు నప్పు డిట్లు మాటలాడజొచ్చిరి:—

దామో—నారాయణశాస్త్రీ! నిన్నెంతకాలమునకు జూచితినోయి!

నారా—దామోదరరావు! నిన్ను గొంచెమైన నానవాలుపట్టజాలనైతిని సుమీ!

దామో—మనము విడిపోవునప్పటికి మీసకట్టులైన లేదు. ఇరువురిరూపములు బొత్తిగ మారిపోయినవి.

నారా—మనము నేడీవిధముగ మరల గలసికొనుట కేవల దైవసంకల్పము.

మీనాక్షి యీమాటలు వినునప్పటికి వారిరువురు చిరకాలమునకు గలసికొనిన ప్రాణమిత్రులుగాని శత్రులు గాదని,—వారియొండొరుల బాహుబంధనములు ప్రియమైత్రీసూచకములగు దృఢాలింగనములుగాని కలహలక్షణములుగావని,— తేట తెల్లమయినందున తానొనరించిన పనికిమిగుల సిగ్గుపడుచు దల వ్రాల్చికొని తటాలున లోనికి బాఱిపోయెను. సంగీతోపాధ్యాయుడు నీయుదంత మంతయు గ్రహించి నవ్వుకొనుచు వెనుకకు బోయెను.

3

నారాయణశాస్త్రి దామోదరరావునకు బాల్యస్నేహితుడు, సహాధ్యాయి. లోవర్ సెకండరీ క్లాసులో కృతార్థులైన పిదప దామోదరరావాంగ్లవిద్యాభ్యాసమునకు పై మెట్టునకు బోవగ, నారాయణశాస్త్రి గీర్వాణ విద్యాభ్యాసనాభిలాషియయి కాశీక్షేత్రమునకు బోయెను. కాలక్రమమున నుద్యోగవశమున దేశదేశములు దిరుగుచున్న దామోదరరావును, జ్యోతిశ్శాస్త్రమున జగదేక పండితుడని ప్రఖ్యాతి గాంచి విద్యాప్రదర్శనమూలమున ద్రవ్యార్జనము సేయ నెల్ల దేశములు దిరుగుచున్న నారాయణశాస్త్రియును మరల నొకరినొకరు గలసికొనుటగాని, యొకరివార్త లొకరు వినుటగాని తటస్థింపనయ్యెను.

నారాయణశాస్త్రి దేశసంచారము సేయుచు మార్గవశమున దామోదరరావున్న గ్రామము జేరి జ్యోతిశ్శాస్త్రోక్తవ్యుత్పత్తినిగూర్చి పురమందిరమున నుపన్యసింప వలయునని యు, పురజనులు సేయు ద్రవ్యసత్కారము స్వీకరించి పై గ్రామముపోవలయునని యు నుద్దేశించి పురమందిరాధ్యక్షుడగుట నీతనిదర్శింపవచ్చెను. సంభాషణా వశమున నిరువురు బరస్పరము గుర్తించుకొని బ్రహ్మానంద పరవశులైరి. దామోదరరావాతని మిగుల నాదరించి తన యింట నుంచికొని చిన్ననాటి ముచ్చటలు మున్నగు వివిధ విషయములనుగూర్చి రెండు తెగని ప్రియభాషణములతో బ్రొద్దులు గడపజొచ్చెను. ఆసంభాషణముల నడుమ జ్యోతిశ్శాస్త్ర సత్యమునుగూర్చి మాత్ర మిరువురు దగవు లంబడుచు వచ్చిరి. ఒకనాటితగవులో నారాయణశాస్త్రి దామోదరరావుతో గట్టిగ నిట్లు చెప్పెను:—

"నీజననకాలఘటికాగణనము తప్పు. కావున నీజాతకఫలములు సరిగ జెప్ప వీలులేదు. అర్ధవిఘటికాకాలము వ్యత్యస్తమైనమాత్రమున ఫలము లద్భుతముగ విపరీతము లయిపోవుచుండ, జనసామాన్యము మాటయటుంచి నీవంటి మహాబుద్ధిమంతులైనను టక్కున సరిపోవునట్లు సరియగు వేళ నెట్లు కట్టగలరో నీవు చెప్పుము! వందలకొలది గడియారములలో నేరెంటికి బొందిక లేనపుడు నీవు దేనినాధారముగ జేసికొనగలవు? ఋతుభేదములబట్టి, దేశభేదములబట్టి గ్రామగ్రామమునకు గాలము భేదించుచుండ, మదరాసు రైల్వే టైమొకనికి, గలకత్తా రైల్వే టైమొకనికి తాలూకా కచేరి టైమొకనికి వేదవాక్యము లట్లు పరమప్రమాణ

ములా? కాలమును దెలుపు పని జ్యోతిష్కునిదిగాని నీది కాదు. కావుననే యూరని గాలజ్ఞుడనిరి. జ్యోతిష్కుని పాండిత్యవిశేషము మూడుసంవత్సరములు కాలము గట్టుటయం దున్నదని విశదపడుచున్నపుడు ఆలస్యోద్దూవేళ బుట్టితివని వ్రాయబడిన నీజాతకమునకు సరిగ ఫలము లెట్లు చెప్పవచ్చును? సాధారణముగ జననకాలవ్యత్యాసమువలన నేజాతకఫలములకు బ్రత్యక్షవ్యత్యాసమేర్పడుచున్నది. అటువంటి మిడిమిడిజ్ఞానము సంపాదించి పొట్టకూటికై పెద్దవేషములు వేయు జ్యోతిశ్శాస్త్రవంచకులవలన నీశాస్త్రసత్యము మఱియు సన్నగిల్లిపోవుచున్నది. నిదర్శనము జూపని మాట చెప్పవలదంటివి గావున నీవొక్కపని నేయుము. నీబంధుమిత్రుల యిండ్లలో నెందయిన బ్రసవసమయము దటస్థమయినపుడు జననకాలనిశ్చయము నేయుటకు నా కించుక యవకాశము గలిగింపుము. ఆశిశుజాతకము వ్రాసి ఫలములు సరిగనే చెప్పెదను. బాల్యాంతమున నిట్లని, యౌవన మధ్యమున నట్లని చెప్పుదు. శిశూదయమైన క్షణమునుండి కోరిన వివరముతో దినచర్య వ్రాసియిచ్చెదను. అందు భేద ముండునేడల నాకుండలములు చెవులతో గోసి నీకర్పించెదను. సరిగా చెప్పిన?—"అనియెను. "నేను చెవులుగోసికొని నీకీయజాలను సుమీ!" యని నవ్వుచు బలికె దామోదరరావు మరల నిట్లనియెను:—

"ఆసేతుశీతాచల పరీతభారతదేశమంతయును బొమ్మజెముడువలె నలముకొనిన యీవిద్యను,—గ్రద్దె గుణ్ణపుతాపువలె నందందు స్వల్పనిదర్శనముల జూపుచున్న యీవిద్యను,—పొట్టకూటిరాయళ్లచే వ్యాపింపజేయబడి యమాయకలోకమును వంచించుచున్న యీవిద్యను,—ప్రాచ్యపాశ్చాత్య విద్వన్మణులచే కేవలగతానుగతికమును నున్మాదభ్రమయని గిరగిర త్రిప్పి చెత్తకుప్పలపైకి విసరి పారివేయబడిన యీవిద్యను—సనిదర్శనముగ యథార్థమని నీవు ఋజువుపఱచి పునరుద్ధరింపగలిగినయెడల నాయావదాస్తిలో సగము నీకు వ్రాసియిచ్చెదను. పూర్వపశ్చిమదేశములలో నీపేరు సువర్ణాక్షరములతో వార్తాపత్రికలందు బ్రకటింపజేసెదను. నీకీర్తి దిగంత విశ్రాంతమై చిరస్థాయియై వెలయుటకు వలసిన యన్నిపనులు జేసెదను. ఇదియే నాప్రతిన" యని పలికెను. "నా గెలుపునకు నీ వేమియు నీయనక్కఱలేదు. జ్యోతిశ్శాస్త్రమందలి నీయవిశ్వాసము వదలుకొనిన నా కంతియె చాలును. శిశుజననసమయ మెందయిన దటస్థమయినపుడు నీవు నన్ను బిలుచుకొనిపోవుటయె కర్తవ్యము సుమీ!" యని నారాయణశాస్త్రి దామోదరరావునకు బ్రత్యుత్తర మొసగెను.

౪

నారాయణశాస్త్రి యాపురమందును, చుట్టుప్రక్కలనున్న మఱికొన్ని పట్టణములందును జ్యోతిశ్శాస్త్రమునుగూర్చి యుపన్యాసములు గావించి, పలువురి జాతకముల కద్భుతముగ ఫలములు చెప్పి, పెద్దలకందఱకు గృతపరిచయుండై మహాపండితుడను కీర్తిధనమును, ధనమును గడించుచుండెను. నాలుగైదుమాసము లిట్లు గడచినవి.

దామోదరరా వొకదినమున నారాయణశాస్త్రి కొఱకు సేవకునివెనుక సేవకు నమితాత్రముతో బంపజొచ్చెను. ఆవార్త విని తత్క్షణమే నారాయణశాస్త్రి దామోదరరావు గృహమునకు వచ్చెను. అపు డామిత్రు లిరువు రిట్లు సంభాషించిరి.

నారా—ఏమోయి దామోదరరావు? తొందర లేమియు లేవు గద?

దామో—నాభార్య నేటియుదయమునుండియు బడ్డకముగ నున్నది. తొమ్మిదినెలలు నిండి నేటికి పదిదినములు గడచినవి. నేడు ప్రసవము గావచ్చును.

నారా—మంత్రసాని కొఱకు వర్తమాన మంపితివా? వలసిన సామగ్రియంతయు సిద్ధపఱచితివా? అదు దక్షతకు రెండుమూడు మాసములక్రితమె మీయత్తగారు వచ్చియున్నదిగదా! ఈపడుమ నిను జూడవచ్చిన నీకుమార్తెలుగూడ నింకయు నున్నట్లున్నది!

దామో—అవును. అంద ఱున్నారు. వలసిన వస్తువులన్నియు సిద్ధము నేయబడియేయున్నవి. మంత్రసానికి వర్తమానము లంపితిని. నీవిప్పటినుండి జననకాలఘటికాగణనము సరిగ చేయుము. నే నితరవ్యాపారముల జూచుకొనుచుండెదను.

అంతలో రంగదాసు మంత్రసానిని వెంట నిడుకొని లోనికి వచ్చెను. మంత్రసాని స్లిప్పరులు, గోడను గోడవార నుంచి దామోదరరావునకు నమస్కరించెను. అత డాగదిలోని కరుణమని చేతితో సంజ్ఞ చేసెను. నారాయణశాస్త్రి యామెను నాలుగడుగులు దూరముగ దీసికొనిపోయి రెండునిమ్మపండ్లా మెచేతి కిచ్చి, "శిశుశిరోదర్శనమైన తక్షణమే యొక నిమ్మపండును, శిశూదయము సంపూర్ణమైన తక్షణమే యొక నిమ్మపండును గదిలోనుండి నాకడకు విసరివేయవలెను. ఎంతతొందరలోనున్న నీ వీపనియం దప్రమత్తురాలవై యుండవలయును జామీ!" యని నొక్కి చెప్పి తాను వేవేగ స్నానముచేసి శుచియై వచ్చి పురిటి గదికెదుట సావడిలోగూరుచుండి, యుపనిషన్మంత్రములు జపించుచుండెను. ప్రసవవేదనా జనిత దుర్భరకష్టముచే భార్య గదిలో నార్చుచుండ, నాయరపుల వినుచున్న దామోదరరావు కంట నీరు గార్చుచుండెను. అమ్మా! యిక బ్రతుకనని వణకిపోవుచున్న కూతును గట్టిగ బట్టుకొని యోదార్చుచు జగ్గమ్మ యామెకు విసరుచుండ, లోకమున నెవ్వ రెఱుగని మహాకష్టము నీకొక్క తెకు సంభవించిన ట్లంత యరపు లరచెదవేలని మంత్రసాని మీనాక్షిని గసరుచుండెను. నీళ్ల కాగు క్రింద మంట వేవేగ జేయవలయునని, చేటలో నిప్పు పోసి గుమ్మముకడ సిద్ధముగ నుంచవలయునని జగ్గమ్మ దామోదర రావుకూతులగు జానకీసావిత్రుల కుపదేశించుచుండ, బ్రహ్మచారికా గృహగవాక్షములనుండి, కవాటరంధ్రములనుండి లోనికి దొంగి జూచుచున్న ముప్పదిమంది కేమాత్రమో యధికముగ నున్న యనాహూతాగతకాంతామతల్లులు తా మెఱిగిన సుఖప్రసవోపాయములన్నియు మచ్చస్వరములతో నుపన్యసించుచుండిరి. వెలుగునకు జాటులేదరే యని మంత్రసాని యాడువాండ్రనందఱ నదుముచుండెను. మగవా రిక్కడ నుండరాదని యొకస్త్రీ దానతి నారాయణశాస్త్రి నవ్వులకు బొమ్మనుచుండెను. సావడి రచ్చసావడివలె నుండుటం గాంచి దామోదరరావు వాండ్రనందఱ బెరటిలోనుండి యవ్వలి గుమ్మముకడకు బొండని బంపివైచెను. అంతలో నారాయణశాస్త్రి యొడిలో నేదియో పడిన ట్లగుటచే నాత డులికిపడిచూచి యది గదిలోనుండి వచ్చిన నిమ్మకాయయని గ్రహించెను. ఇంచుక తడవులో మఱియొకటి గూడ బడుటచే నాతడు తటాలున లేచి పరుగుపరుగున పెరటిలోనికి బోయెను. అత డులికిపడి పరుగెత్తిపోవుటకు గారణ మెఱుగక తొట్రుపడుచు దామోదరరా వాతనివెనుక బరుగెత్తి పెరటిలోనికి బోయెను. నారాయణశాస్త్రి యెండలో దనసీడ కెదురుగ నిలువబడి కరాంగుళములు కర్ణరంధ్రములం దుంచి పాదములతో దనసీడను గొలుచుచుండెను. అంతలో నొక బాలిక బరుగెత్తుకొనుచు వచ్చి "తాతయ్యగారూ! మీకు చిట్టి



కొడుకు పుట్టినాడని చెప్పె. దామోదరరావు మొగము చేటయంత చేసెను.

౫

"కన్నులు తల్లికన్నులవలె విశాలముగ నుండును. ముక్కును వల్లె చక్కగ—కుదురుగ—నుండును. నుదురు మీనమురువలె రమణీయమ్ముగ నుండెను. ఛాయమాత్రము మీ యిరువురికన్న నించుక తక్కువో" యని నాటి మధ్యాహ్నమొంటిగంటవేళ దౌహిత్రరూపరేఖాసౌందర్య శోభా

గ్యమత్తగా రల్లుడుగారికి బోధించుచుండెను. "మా నాన్నగారి నుదురు మిట్టనుదురని నేటికి నీవొక్కతె వనుచున్నావు. అది మిట్టయుగాక, పల్లమునుగాక, సమముగ—విశాలముగ—తీర్చిన ట్లున్నది. నీకు తెలియకున్న నెవ్వరి నడిగెదవో యడుగు"మని సావిత్రి యిరువకె రోషముతో జగ్గమ్మ కెదురు చెప్పుచుండెను. "ఆమె యట్లనుకొనినంత మాత్రమున లేని మిట్ట నాన్నగారి నుదుటికి వచ్చునటే. వెఱ్ఱిదాన! అమ్మమ్మతో నీ వెందు కట్లు వాదింతు"వని జానకి సావిత్రిని మందలించుచుండెను.

అంతలో నారాయణశాస్త్రి దామోదరరావు స్నేహితుల మువ్వురితో లోనికి వచ్చెను. పరస్పరకుశల ప్రశ్నము లైనతోడనే శిశుజాతకము లెట్లున్నవో నీజ్యోతిష మహిమచేతను నించుక చెప్పుడు చూతమని దామోదరరా వడుగగ నారాయణశాస్త్రి చిత్రించిచూచిన ట్లున్న తెరగు చెప్పెను. అంద ఱాశ్చర్యపడుచుండగ, నిది కాకతాళీయమా, యథార్థమా యని దామోదరరా వాలోచింపజొచ్చెను. జగ్గమ్మ పురిటిగదిలోనికి బోయి పరుగుపరుగున వచ్చి, "బాబూ! మీరు చెప్పినట్లు మెడమీద, నడుము తుంటిమీద పుట్టుమచ్చలు స్పష్టముగ నున్నవి. మీ రెవ్వర మీదైన జూచినారే" యని విపరీతాశ్చర్యముతో బలికి యాతనిం బొగడజొచ్చెను. నారాయణశాస్త్రి యాప్రసంగమున కడ్డువచ్చి, "దామోదరరావూ! మనము కొన్ని విషయములు తొందరగ మాటలాడవలసియున్న"దని చెప్పి దామోదరరావును, నాతనిమిత్రులను నుత్తరపుగదిలోనికి గొనిపోయెను. గవ్వలాడుకొనుటకు సావిత్రి జానకిని దక్షిణపుగదిలోనికి గొనిపోయెను. శుభలేఖలు వ్రాయించుటకు జగ్గమ్మ రంగదాసును పశ్చిమపుగదిలోనికి గొనిపోయెను.

దామోదరరావుగదిలో మిత్రులందరు దీర్ఘధ్యాననిమగ్నులై యుండిరి. కత్తి నాటిన నెత్తురు రానట్లుండిరి. మొగములు వెలవెల బోవుచుండెను. వైద్యుడు ప్రక్క నున్నంతమాత్రమున గ్రొత్తగ వచ్చు హాని యేమని సాంబశివరా వనుచుండెను. మరణశాసనము వ్రాసియుంచుకొనినంతమాత్రమున సంభవించు నష్టమేమని నగరాజ మనుచుండెను. ఉన్నలాభ మంతయు గాని నష్టముమాత్ర మావంతయు నుండదని నిత్యానంద మనుచుండెను. "పరిపూర్ణారోగ్యశరీరుడనైన నేను, నిశ్చలధైర్య మనస్కుడనైన నేను, మరణకారణ మణుమాత్రమును లేదని దృఢవిశ్వాసముతోనున్న నేను మూఢునివలె బూటకపుజ్యోతిష ఫలములు నమ్మి ప్రాణ ధన రక్షణప్రయత్నము లొనరించి నలుగురిలో నవ్వులపాలు గాజాలను. అకారణభయము విడిచి మీరందఱు ధైర్యముగ నుండు"డని దామోదరరా వనుచుండెను. ఇక నేమి చేయుటకు దోచక బలలు వ్రేలపై చికొని మిత్రులందఱు క్షణకాల మూరకుండిరి.

"ప్రమాదో ధీమతామపి" యను న్యాయమున శిశుజాతక రచనయందేమైన పొరపాటు లుండెనేమో క్షమించి మఱియొక్కసారి చిత్తగింతురా యని నిత్యానందము విన్నవింపగ నారాయణశాస్త్రి యిట్లు పలికెను" త్రిలోకములు తిరిగివచ్చినను నే నొకసారి లిఖించిన లేఖనమునకు తిరు గుండదు. అయినను నా బాల్యమిత్రుని విషయమునకు బలుమారులు పరికించితిని. విధిలేక ముందుగ మీ యందఱకు దెలిపి యుందు నవసరార్థి యీఘోరవృత్తి నీతని కలిగింప వలసివచ్చినది. పితృస్థానాధిపతియగు శని పాపుడగు క్షీణచంద్రునితో గలసియున్నాడు. పితృస్థానమున పాపుడగు రవి, చతుర్థమున కేతువు, కర్మస్థానమున రాహువు నున్నాడు. కేంద్రములు శుభగ్రహశూన్యములై యున్నవి."

నిత్యా—అయ్యా! మా కవియన్నియు జెప్ప నక్కఱలేదు లెండు. ఫలములు చెప్పిన జాలును.

నారా—ఫలములు సకారణముగ జెప్పవలదా! వక్రియగు శని సప్తమమునన్న కుజుని వీక్షించుచున్నాడు. నేటి మధ్యాహ్న మైదుగంటలకు శని వక్రతాత్యాగ మగుచున్నది. అది పితృమారక యోగకారకము. ఇంతియే గాక—

నగ—గ్రహస్థితులకు ఫలము తెలుపని మా కవియన్నియు జెప్పెద రేల!

నిత్యా—అయ్యా! అన్నియు దుర్యోగములేనా! గండము తప్పనే తప్పదా?



౫. కృష్ణరాజసాగరము అనకట్ట-వెలుపలిభాగము

దామోదరరావు మనసు మారక తిన్నయమునుండి మరలించుటకు డాక్టరు విశ్వప్రయత్నములు సేయుచుండెను. భారతీయుల మూఢాచారములనుగూర్చి, గాంధిగారి స్వరాజ్యసంపాదనా ప్రయత్నములనుగూర్చి, లేబరుపార్టీవారి యపజయమునుగూర్చి, జర్మనీదేశీయుల తెలివితేటలనుగూర్చి యతడత్యాసక్తి నటింపుచు దామోదరరావుతో ముచ్చటించుచుండెను. నడుమనడుమ పెద్దపెట్టున నవ్వుచు వానిని నవ్వించుచుండెను. చాటుచాటుగ రిష్టువాచిలోని టైము జూచుచుండెను. కాల మీవిధముగ గడుపుచుండ గొంతతడవునకు దామోదరరావు మాటలలో రవంత తడబాటున్నటుల, వానినిట్టూర్పులలో నొకింత మందగింపున్నటుల, నాడీగతిలో దనుమాత్రము వేగాధిక్య మున్నటుల డాక్టరు కనిపెట్టెను. అతడు దామోదరరావు మొగమువంక జక్కగ బరిశీలించి యాతనిదృష్టి యెట్టయెదుట బల్లపై నున్న యలారపు గడియారముపై వ్రాలియున్నటుల గ్రహించెను. అప్పటికి గడియారమున మూడుగంటల నలుబదియైదు నిమిషములవేళ యైనది. తక్షణమే యాగడియారము వెలుపలకు దీసికొనిపొమ్మని యెదుటిసావడిలో గూరుచున్న రంగదాసునకు గనుసంజ్ఞ చేసి డాక్టరు దామోదరరావును మఱియొక ప్రసంగములోనికి దింపెను. ఆ ప్రసంగమధ్యమున రంగదాసు గడియారము నీవలకు దీసికొనివచ్చెను. డాక్టరెంత ప్రయత్నించుచున్నను దామోదరరావులోని క్రమక్రమాధిక మాంద్యాభివృద్ధి నిలుచుటలేదు. ఇతడేమి చెప్పిన బ్రత్యుత్తరము నిచ్చుటలేదు, సరిగనూకొట్టుట యైన లేదు, మొగమెత్తి చూచుటయైన లేదు. దానితో డాక్టరుగారి నాడిలోగూడ రవంత గతివేగ మేర్పడినది.

డాక్టరాతనిభుజములపై చేతులువైచి వినుచుంటివా యనుచు నిట్టటు నూపుచుండ "ఆ? ఆ? రైలువేళ యైనదా" యని "మీనా! చాలు నిట్లు"మ్మని, "దాసుగారి కిప్పుడే వర్తమాన మంపుదును లే" యని, "నారాయణా శ్రీ! రక్షింపు"మని, పరాకుమాటలాడుచుండెను. గాలికి నమస్కరించుచుండెను. గడగడవడకి పోవుచుండెను. తక్షణమే డాక్టరు తోలుపెట్టె తెఱచి యాతని కొకయింజక్షనిచ్చి, యనుక్షణము నతనిమొగమువంక, రిష్టువాచివంక నదేపనిగ జూచుచుండెను. అయిదుగంటల కిక నరగంట వ్యవధి యున్నది. గుణ మించుకయు గనబడమిచే డాక్టరకు ముచ్చెమటలు గ్రమ్మెను. వణకిపోవుచున్న చేతులతో డాక్టరాతనినాడిని బరీక్షించి జూడగ మందగించి పోయినట్లు తోచెను. శరీరము స్పృశించిచూడగ జల్లబడి పోయినట్లు తోచెను. డాక్టరొక్క దీర్ఘనిశ్వాసము విడిచెను.

ఏరోగములేని యీ యకారణ పరిణామమునకు, దుస్సహదురవస్థకు డాక్టరాశ్చర్యపడుచు జాలిగదుర వాతని మొగమువంక వట్టిచూచుచుండెను. దామోదరరావు శరీరమునుండి యెద్దియో ధ్వనియైనటుల వినబడగ డాక్టరులికిపడి తదేకదృష్టితో వాతని మొగమువంక బరికింపసొచ్చెను. అపు డత్యంత హీనస్వరముతో "నిజము నిజ"మనుమాట యాతనికి స్పష్టముగ వినబడినది. తోడనే డాక్టరు రిష్టువాచివంక బరిశీలింపగ నైదుగంటలకిక పది నిమిషముల వ్యవధియున్నది. దామోదరరావునాడి డాక్టరు చక్కగ బరీక్షించిచూచి నాడి యింకను స్పష్టముగ నున్నదని గుర్తించి యొక్క నిముస మెద్దియో యోచించి, తక్షణ మాతడు గడియారపుముల్లు నైదుగంటల పదునైదు నిమిషములకు ద్రిప్పివైచి "దామోదరరావూ! నీమారక కాలము గడచిపోయినది లే లె"మ్మని బిగ్గఱగ నఱచుచు నాతని నిట్టటు గదిపెను.

"ఆ! ఆ! నిజమేనా?" యనుచు నెక్కడలేని శక్తితో నాతడు నువ్వెత్తుగ లేచి కూరుచుండెను.

డాక్టరు కేనుగంతబలము వచ్చినది. తక్షణ మాతడు "సందేహమేమి" యనుచు గదితలుపులు తెఱచి రిష్టువాచి జూపించెను. తక్షణమే దామోదరరావు మిత్రులు బ్రహ్మానందముతో గదిలోనికి జొరబడి దామోదరరావును బిగ్గరగ గౌగిలించుకొనిరి. అందఱు సావడిలోనికి రాగ జానకీసావిత్రులు పరుగు పరుగున వచ్చి తండ్రిని గౌగిలించికొని వెక్కివెక్కి యేడువజొచ్చిరి. గండము గడచినందుకు సంతసింపవలయునుగాని యేడువవచ్చునా యనుచు నందఱాబాలికల నూరడించిరి.

దామోదరుని యాత్మశాంతి నిమిత్తము తదేక నిష్ఠతో గట్టిగ కనులు మూసికొని యీశ్వరధ్యానము సేయుచున్న నారాయణశాస్త్రిని వీపుపై నొక్క దెబ్బ జరచి నిత్యానందము లేపెను. దానితో వారిద్దరు కన్నులు తెఱచి



“ఆ! ఆ! నిజమేనా? యనుచు......గూరుచుండెను.”

కొట్టుకొనుచున్న దామోదరరావును జూచి తటాలున లేచి బిగ్గఱగ కౌగిలించికొనిరెను. డాక్టరు నారాయణశాస్త్రికి రిస్టు వాచి జూపించెను. అతడా వాచి జూచి, దామోదరరావు మోము జూచి, మిన్ను జూచి, మన్ను జూచి నేలపై జతికిలబడిపోయెను.

౨

“ఎంతసేపటినుండి యఱచుచున్న నెవ్వరు విని పించుకొనరేల?” అనుచు మీనాక్షి బిగ్గఱగ నఱచుచున్నట్లు వినబడగ నందఱటు దిరిగి చూచి మంచముమీది కాలు నేల మోపరానంత పచ్చిబాలెంతరాలు పురిటిగది దాటివచ్చి యట్లఱచుచున్నందున కందఱాశ్చర్యపోవుచు నటు బరుగెత్తిరి. రంగదాసు పురిటిగుమ్మముకడ నడ్డదిడ్డముగ నుండుకొనియుండెను. మీనాక్షి గజగజ వణకి పోవుచు వారిని జూచి, “యీయన పావుగంటక్రితమిక్కడ వచ్చి యేమియుపలుకని నన్నాగడించుచుండగ నీయన చేతిలోనున్న యలారముగడియారము గంగు గంగు మని గంటలు కొట్టెను. పరధ్యానముగ నుండుటచే నాజోలు, నా ధ్వనితో నులికిపడి గడియారము నట్టె జారవిడిచి



నేమక కిట్టె దొరిగి పడిపోయిరి. ఎంతపిలిచిన బలుకుట లేదు. కదలుట మెదలుట లేదు. పడుటలో దెబ్బ తగిలి మూర్ఛిల్లెనో యేమొ. డాక్టరుగారిని జూడుమను”డని చెప్పెను. దామోదరరా వట్లు సేయుమని యడుగగ డాక్టరు రంగదాసు శరీర మొక్క నిముసము పరీక్షించి, “యిది రంగదాసు శవముగాని సజీవశరీరముగా”దని చెప్పి యింటికి బోయెను. ఆ మాట విని యందఱు నాశ్చర్య నిమగ్నులై కొయ్యబడిపోయిరి. పురిటిగుమ్మముకడ నీయన శవమేమి దేవుడా! యనుచు మీనాక్షి మంచముపై జతికిలబడిపోయి వెక్కి వెక్కి యేడువజొచ్చెను. సాంబశివరావు ముక్కుపై వ్రేలుపెట్టుకొని నిర్ఘాంతపోయెను.

నగరాజము వలెనంచుకొని నిశ్చేష్టుడై పోయెను. నిత్యానంద మహాశ్చర్యమున మునుకొనుచు వెనుకకు బోయెను. జేవురించిన ముఖముతో, కంపించిపోవుచున్న దేహముతో, నగ్నిగోళాకృతి వహించిన కనుగ్రుడ్లతో దామోదరరావకృాంత రౌద్రమూర్తియై పండ్లు పటపట కొఱుకుచు పురిటెనుపమ్ముమువలె ప్రత్యక్షముగ జూచుచుండెను. ముందున కులుకు నద్యమించుచుండెను. అతడేమి సాహసకృత్య మొనరించునోయని భయపడి తక్షణమే మిత్రు లాతని గట్టిగ బట్టుకొని "మాటాడరాదు. నోరెత్తరాదు సమయము నర్తించి శాంతము వహింపు" మనుచు సావడిలోనికి గొనివచ్చిరి.

జ్యోతిశ్శాస్త్ర సత్య మింతవిపరీతముగ నశించుటకు కారణ మేమైయుండునని కన్నులు గట్టిగ మూసికొని తల ప్రద్దలయిపోవునట్లు యోచించుచున్న నారాయణశాస్త్రి పాదములపై బడి దామోదరరా విట్లు పలికెను:—

"మిత్రుడా! స్థూలదృష్టిని జూచి తొలుత నందఱము మోసపోయితిమి సూక్ష్మదృష్టిని జూచి జ్యోతిశ్శాస్త్రసత్యము నిపుడు దృఢముగ విశ్వసించుచుంటిమి. జాతకమని చెప్పి మారకము చిరరహస్యఘోరపాతకచారిత్ర వహితముగ నిపుడు ప్రత్యక్షమయిపోయినది. సంగీతవిద్యాగురురూప ఘోరరాక్షసుడు—మిత్రవంచకుడు—మాతృద్రోహి—సరిగ నీవు చెప్పిన సమయమునకు మారకము వాతబడి నశియించినాడు. కాలసర్పమును మెడకు జుట్టుకొని పూలదండ యనుకొని మురిసిపడి యవివేకినై పోయితిని. కండకావరముచే నిన్ను, నీశాస్త్రసత్యమును దూలనాడిన నాయజ్ఞానమును మన్నింపుము." దామోదరరావశ్రుధారలతో నాతని పాదములు దడిపెను. ఆమాటలు విని యాశోకమును గని, నారాయణశాస్త్రి హరిహరీయనుచు జెవులు గన్నులు మూసికొని దామోదరరావును లేవనెత్తెను. అంతలో డాక్టరుగారి సేవకు డొకడు రు ౧౧౨-౨౨-౧౦ ల కొక బిల్లు తెచ్చి దామోదరరావు చేతికిచ్చెను.

దామోదరరావు నాటినుండి పరమవేదాంతియై జీవితశేషమును గడప గాశీక్షేత్రమునకు బోయెనని యొకవదంతి, పునర్వివాహ ప్రయత్నమున మున్నాడని యొకవదంతి! నిజ మెవనికెఱుక!

---

## సరస్వతీ పూజనాఁడు

కొల్లూరు ధర్మరాయకవిగారు, బి. యె.

కవి ముఖోద్గత విశ్వకల్యాణ గీతారవంబు వల్కిన వేదవాగమృతము
క్రౌంచ విహంగ యుగ్మ వియోగశోక సుశ్లోకమౌ దివ్యవాల్మీకిరుతము
భారత రాజ్యాంగ పరివర్తిత సమస్త నీతి పుంజము వ్యాసపూతవాక్కు-
విశ్వసౌందర్య మావిష్కృతంబై నాన్యతస్స్పృష్టమౌ కాళిదాస రచన
మది నెఱింగి యేతత్సుధామధురిమంబు - ననుభవించుట కన్యభాషానుభూతి
తోడుపడ దంతె చాలు చేతులు మొగుడ్తు - సాంస్కృతిక శారదా, నమస్కారమమ్మ!

కరుణరసంబే జగన్మనో వ్యాపారమూలం బనిన భవభూతి సూక్తి
వేదాంతవాదాంతమౌ దేవదేవు నిరూపించు త్రిమత స్వరూపయుక్తి

ప్రకరణ త్రితయ విభక్తజీవితము నెఱింగించు భర్తృహరి ప్రసక్తి
బృందాచర న్నందనందన మురళిఁ బల్కించు లీలాశుకగీతశక్తి
మది నెఱింగి యేతత్సుధామధురిమంబు - ననుభవించుట కన్యభాషానుభూతి
తోడుపడె నంతె చాలు చేతులు మొగిడ్తు - సాంస్కృతిక శారదా, నమస్కారమమ్మ!

ఆంధ్రభాషా ప్రథమాధ్యాపకత్వంబు వహించు నన్నయభట్టు చెలిమి
జిహ్వాగ్రసంచర త్సిద్ధ కావ్యప్రవాహముఁ దేలించు తిక్కన్న సేవ
కవియుగ్మరచన లొక్కట జోడుసేయు సాహిత్యప్రకాండు సాంగత్యగరిమ
భక్తికైంకర్య సంభావనయే జీవితావధియైన పోతన పరిచితి
నీ కృపాకటాక్షంబున నాకుఁ గలిగె - నేమి యొనరించి నీ ఋణ మీఁగువాఁడ
నెన్ని జన్మాలకైనను నిన్ను మరువ - నాంధ్రశారదా, వందనమమ్మ నీకు.

హిమవన్నగంబుపై శృంగారపుంజంబు సృష్టించు పెద్దన శిల్పపటిమ
వ్యాసవాల్మీకి కావ్యద్వంద్వ మొక్క వాక్కుననె కల్పించు సూరనప్రశస్తి
విద్వదాపథ మయఃపిండంబు సృజియించిన కళావిలాసు శ్రీనాథుకవిత
నగ తరంగిణులు కన్నకుమార్తె కల్యాణమును బాడు రామభూషణుని సొగసు
నీకృపాకటాక్షంబున నాకుఁ దెలిసె - నేమి యొనరించి నీఋణ మీఁగు వాఁడ
నెన్ని జన్మాల కైనను నిన్ను మరువ - నాంధ్రశారదా, వందన మందుకొనుము.

ప్రాచ్యపాశ్చాత్య కళామేళనంబున వన్నె కెక్కిన రవిబాబు కవిత
బ్రదుకు తెన్నే యొకపాటయై కరఁగిపోఁ బాడు సరోజిని పలుకుఁ దేనె
జగమెల్ల రక్తతేజఃపరీతముగాఁగ కల్పించెడు హరీంద్రు కావ్యగర్జ
సుకుమారపేశలతకు జీవితంబె యాదర్శమై తగు తోరుదత్తుపాట
నీకృపాకటాక్షంబున నాకుఁ దెలిసె. నేమి యొనరించి నీఋణ మీఁగువాఁడ
నెన్ని జన్మాలకైనను నిన్ను మరువ - నాంగ్లశారదా వందనమమ్మ నీకు.

---

# గుడ్డిపిల్ల

అడివి బాపిరాజు గారు

(ఒక చిన్న కథ)

౧

తాడేపల్లిగూడెం స్టేషన్లో ఎక్కింది ఆ బాలిక బెజవాడబండి. కూడా ఒక చిన్నపిల్లవాడు ఆ బాలిక చేయిపట్టుకుని దారి చూపుతూ వున్నాడు. చినిగిపోయిన గుడ్డల్లో మేఘాల్లో చంద్రుడులా వుంది ఆమె. ఆమె అందం ఆమెకే తెలీదు.

"వినవే పల్లవా మృదూచరణా
కరుణా-విత రాణా గూణా భరాణా!"

అని పల్లవి ప్రారంభించింది. ఒక్కసారిగా పెట్టెఅంతా నిశ్శబ్దం ఆవరించింది. విరిసిన వసంతోదయంలో మల్లికాపువ్వు సుగంధంలా ఆకిన్నరస్వనం, మహావేగంతో పరుగెత్తుతున్న రైలు హోరు శ్రుతికాగా, ఆపెట్టెఅంతా ప్రవహించింది.

"జనవీథు డానాతిచ్చిన దండాకాటవికి—"

అందరి హృదయాలు కదలిపోయినవి. కొండచిలువ పెనవేసుకున్న జింకల్లా చైతన్యం రహితమై వింటున్నారు యావన్మందిన్నీ.

"మునివేషధారినై చనియేద ననా వీని—"

ఎవరిభావగాంభీర్యం ఎంతవుందో ఆలోతు వినీలమై, వినిర్మలమై కాంతి తాల్చింది.

ఆమె తలముడి కంగారుగా విడిపోయి నీరులేని మేఘంలా చెదిరివుంది. కళ్లు చూస్తూ వున్నట్లే వున్నవి కాని సంజ్ఞాజ్ఞాన రహితాలై ఎండిపోయిన చెరువుల్లా మెరుస్తున్నవి. తీర్చి దిద్దిన కనుబొమలు, సమమైన ముక్కు, చిన్న నోరు, వణికేపెదవులు ఆమె మొహాన సుందరశ్రీ సాక్షాత్కరింప చేస్తూవున్నవి.

ఆమెపాట ఒక సెలయేరులా మర్మరించింది; రాళ్లగుట్టలో జలజలలాడింది; సుడిగుండాలు చుట్టింది; చెట్లనీడ సమతలంలో పోయింది; ఆగింది; ఒక బండరాయి కింద మాయమై, అవతల తిరిగి ప్రత్యక్షమైంది.

ఆగానం శ్రావణమాసపు పచ్చికలా అల్లుకుపోయింది. శరదృతు పుష్పాలై వికసించింది. నవవసంతం వల్లే ఆనంద పర్వమై పోయింది.

౨

అప్పుడే ఒకస్టేషనులో ఎక్కాడు ఒక బ్రాహ్మణోత్తముడు. వచ్చీరాగానే ఆపాటకు అడ్డంవస్తో ఒక హాస్యవచనం అన్నాడు. ఆత్మానందం మానవాతీతం కాబట్టి లోతు నీళ్లల్లో మునిగినవాళ్లల్లా మనుష్యులు ఆఆనందం ఆట్టేసేపు భరించలేరు. ఈ హాస్యవచనం ఒక్కసారిగా ఆపెట్టెలోవున్న మానవ లోకానికి నిట్టూర్పు యిచ్చింది; తెప్పరిల్ల చేసింది. ఆబాలిక పాట మానివేసింది.

కొత్తగా వచ్చిన హాస్యకాడు జబ్బుహాస్యంతో ప్రారంభించాడు. తనకు తగని జబ్బన్నాడు. అది తిండిజబ్బు. భోజనానికి వెడితే మొగపెళ్లివారికి చేసిన శాకపాకాలన్నీ తన విస్తట్లోనే మాయమవుతూ వుండేవిట. వైద్యుడు ఇది 'మహా రోగం' అన్నాట్ట. దానికి ఉదయాన్నే మినపసున్ని తాటికాయలంత మాత్రలు చేసి ఒక శేరు తేనె పాకం అనుపానంగా ఒక డజను సేవించమన్నాట్ట.

ఇత్యాది హాస్యంతో కోమటి హాస్యం, బాపనహాస్యం, గొల్లహాస్యం, బుడబుడక్కల హాస్యం, కుక్కకూతలు, నక్కకూతలు కుప్పేశాడు. ఆ రైలుపెట్టెలో మనుష్యులు విరగబడి నవ్వారు. కళ్ల వెంబడి అందరికీ నీళ్లు కారినై. డొక్కలు నొక్కుకున్నారు; ఒకళ్ల మీద ఒకళ్లు పడ్డారు. ఎంతహాస్యానికన్నా చిరునవ్వులు మాత్రం వెదజల్లుతుంది హిందూ స్త్రీజనం. అక్కడ ఆడవాళ్లు ఒళ్లు మరచి నవ్వుపొంగుల్లో ఊగిపోయారు.

అక్కణ్ణుంచి డబ్బు వసూలు చేయడం ప్రారంభించాడు. కాన్లు, అణాకాసులు, అర్ధణాలు, రెండణాలకాసులు గళగళ అతనిహస్తంలోకి ప్రవహిస్తూ అక్కడే మాయమయ్యాయి. అతిగాడు కొంచెం 'గుంటుపల్లి భాస్కరుడి' ఇంద్రజాలంకూడా ఎరుగున్నవాడిలా కనబడ్డాడు. ఒకపన్నెండణాలు దాకా పోగుబడింది కాబోలు. అదంతా హూత్తని తెల్లపోయి చూస్తూవున్న ఒకకుఱ్ఱవాడి లాగులోంచి గలగల రాలించాడు—చిల్లరఅంతానూ; 'అమ్మదొంగా' అన్నాడు. పెట్టెఅంతా ఘొల్లుమని నవ్వింది.

“మీరు చల్లగా వుండాలి; నేను పచ్చగా వుండాలి; మీధాన్యాలు నాగాది నిండాలి; మీనవ్వుల్లోంచి ధనవర్షం కురియాలి; జయావిజయీభవ! దిగ్విజయీభవ!! మీ రెప్పుడూ రైలు ప్రయాణం చేస్తూ వుండాలి. బాబూ, సెలవండి” అని తర్వాత స్టేషనులో దిగిపోయాడు. వేరేపెట్టె ఎక్కినాడు కాబోలు.

3

ఇంతసేపు ఆ గుడ్డిపిల్ల నిర్ఘాంతపోయి నిల్చున్నది. అప్పుడప్పుడు ఆ వేళాకోళం మాటలికి చిరునవ్వు నవ్వుకుంది. కూడావున్న ఆపిల్లవాడు పకాలున నవ్వుతూవున్నాడు హాస్యం పొడుగునా.

ఆ బాలిక గొంతుకు సవరించుకుంది.

“ఎంతనీ వేడినా ఎక్కడా వుందువో
కంతుజనక రామా!”

అని హాయిమనేకృతి వక్కటి ఆలాపన చేసింది,

ఆ హాసిగాడి మాటలే పక్క ఆయనికి జ్ఞాపకంచేస్తూ విరగబడి నవ్వుకుంటూవున్న ఒకముసలి కమ్మాయన “వుస్; పిల్లా, వుండు” అన్నాడు.

ఆ బాలిక అల్లాగే నిలుచుండిపోయింది. ఆపసిపాప డబ్బు అడగడానికి వస్తే 'ఛీపో', 'ముట్టుకుంటావు', 'చిల్లర ఆయిపోయిందిరా' అని వరసగా అంటూనే వున్నారు.

ఆబాలిక అల్లాగే చైతన్యరహితంగా నిల్చునే వుంది: రయిలు కదిలిపోతూనే వుంది.

ఆరుకాన్లు వసూలయ్యాయి. ఆ అంధ బాలిక జ్ఞానశూన్యాలైన కళ్లల్లో వేడినీళ్లు తిరుగుతునే వున్నవి. ఆమెనిర్మలహృదయం మాటలేని ఏడుపులో సుడితిరిగింది. పిల్లవాడు వచ్చి ఆ అణాన్నర ఆబాలికచేతుల్లో పెట్టినాడు. ఆ మె మొహంవంక తేరిపార చూశాడు. ఆమె చెయ్యి పట్టుకున్నాడు. వాడి లేతమనస్సు చివుక్కుమంది. వాళ్లిద్దరకూ ఒకిళ్లహృదయం ఒకళ్లకి విస్పష్టమే. ఇద్దరూ ఒకతలువుమూల యిరికి కూలబడ్డారు; ఒదిగిపోయారు. చూపు లేని ఆబాలికకళ్లు, చూపు పుట్టని ఆపిల్లవాడి హృదయం ఒకటికొకటి ఆలింగనంచేసుకున్నవి. ఆబాలకుడు కంటినీరు ఆబాలికచేతులు అడ్డుకుని ఆపుకోపోయాడు.

౪

బాలిక పాట ప్రారంభించకపూర్వమే ఒక వ్యక్తి ఆరైలుపెట్టె ఎక్కాడు. అతడూ రైలు బిచ్చగాడే. ఒక చెయ్యి లేదు.

ముప్పైయేళ్లుంటాయి. చింకిగుడ్డా, చిరిగిపోయినచొక్కాతో ఒకపిల్లంగ్రోవి ఎడంచేత్తో పట్టుకుని రైలు ఎక్కాడు. అప్పుడే ఆ బాలిక తనదివ్యగానం ఆలాపనచేసింది. తర్వాత జరిగినకథ అంతా చూస్తూనే వున్నాడు.

ప్రపంచం అంటే కోపంగల మనిషి. వెనుక రైల్వే పోర్టరుగా వుండి, రైలుకింద పడిపోయి చేయిపోగొట్టుకున్నాడాబిచ్చగాడు. నాఅనేవారు లేకుండా వుండేవాడు. జీతంలో వొచ్చిన నాలుగురాళ్లు మిగుల్చుకుంటూ, గుడ్సుస్టేషనులో అప్పుడప్పుడు దొంగతనంచేసి నవస్తువులు అమ్మగా వచ్చిన డబ్బూ, రైలులోంచి దిగిన ప్రయాణీకుల సామానుమోయుడంవల్ల వచ్చిన కూలి, టిక్కట్టు లేనివాళ్లను ఇంజనుదగ్గిరనుంచో, గార్డుపెట్టెదగ్గిరనుంచో పోనిచ్చినందుకు లంచం, మామూళ్లు, అంతా కలిపి నూరురూపాయలు మూటకట్టాడు. ఇంతట్లో చెయ్యి పోయినందుకు రాజమండ్రీ రైల్వే ఆస్పత్రిలో మూడు నెలలు వున్నాడు. అప్పుడు తన యింటిలో దాచుకున్న డబ్బు ఎవ్వరో మటుమాయం చేశారు. ఉద్యోగం పోయింది. పెళ్లి లేదు. దాంతో అతనికి మతి పోయింది. దిక్కులేనివాడికి దేవుడుకాదు,తిరిపమే దిక్కు. బిచ్చగాళ్లకు కొందరు గురువులు వుంటారు. అతనిదగ్గిర పిల్లంగ్రోవి మాంచి బాగా వూదడం, అందుమీాద వేదాంతం పాటలు, భక్తి పాటలు పాడడం నేర్చుకున్నాడు; రైలుబిచ్చం సాగించాడు. రైలేగా ద్రోహంచేసింది. ఆ వచ్చినడబ్బు కాఫీహోటల్లో తినడం; కల్లు పాకలదగ్గిర గొల్లపుల్లమ్మకూతురు పోసే'ధవళసుధారసం' గళగ్రాహంగా సేవించి, సింధూరానిమిషత్వం, మహాయోగంలో మైకం సంపాదించి అమరు డౌతూ వుంటాడు.

ఆలాంటివాడు ఆగుడ్డిపిల్ల పాట విన్నాడు. అతని మొఱకుమనస్సు గాలిలో వూగిపోయింది. దోహదం చేసిన మొండిచెట్టు వికి

సించినట్లు చిగురు దాల్చింది. ఏ ఆవేశమో అతనికి తెలియదు, ఆతనికి కళ్లనీళ్లు తిరిగినై.

మనుష్యుల చంచలత్వమూ, కఠినత్వమూ అతనికి అసహ్యాం వేసింది. ఎవ్వరూ లెక్క చేయకుండా ఆగుడ్డిపిల్లను నిరసించగానే అతను ముట్టె వంచిన కారుదున్న అయిపోయినాడు. తాను పొద్దుట్నుంచీ పోగుచేసుకున్న అరణాలడబ్బులూ ఆఅమ్మాయి చేతిలో వేసి రైలు ఆగగానే దిగి చక్కా పోయాడు. ఆ అమ్మాయికి ఇంతడబ్బు ఎవ రిచ్చారో తెలవలేదు. "దేవుడులాంటి దయగల ప్రభువు ఎవ రిచ్చారో!" అనుకున్నది.

౫

ఆ గుడ్డిపిల్లకు జ్ఞానం వచ్చినప్పటినుంచీ ఇల్లా ముష్టి ఎత్తుకుంటూ రైలుప్రక్క గ్రామంలో ఒకబహుకుటుంబీకుడు మంచి అంతఃకరణగల ఒకరైతు ఇంటిలో ఒకపంచను వుంటూవుండేది. ఊళ్లో ఒకపెద్దసంసారి బాలికకు సంగీతం నేర్పిస్తూవుంటే వీథివాకిట్లో కూర్చుని సంగీతం చెవులార వినేది. ఏకలవ్యుడులా అద్భుతమైన గానవిద్య సంపాదించుకుంది. ముష్టి బాగా వచ్చేది. ఆడబ్బు "మహాయిల్లాలైన" రైతుభార్యకు దాచ ఇచ్చేది.

పెద్దదవుతూన్నకొద్దీ ఏదో భయం, సిగ్గు కలుగుతూవుండేది. ముష్టికి తిన్నగా వెళ్లక ఇదివరకు పోగుచేసుకున్నడబ్బులు కర్చుచేసుకుని గంజికాచుకుంటూవుండేది. తల్లి ఎవరో, తండ్రి ఎవరో, ఎల్లా ఆరైతుఇంట్లో చేరిందో ఆ పిల్లకు ఏమీ తెలియదు.

ఒకరోజున చేబ్రోలు ముష్టికి పోయి మధ్యాహ్నం కాల్వగట్టున వంటచేసుకుంటూ వుండగా ఒకపసికిల్లవాడు మూడేళ్లవాడు ఆ అమ్మాయి దగ్గిరకు వచ్చాడు. ఎక్కణ్ణుంచి వచ్చాడో. ఆగుడ్డిపిల్ల అతన్ని వళ్లోకి తీసుకుంది. అప్పట్నుంచివాళ్లిద్దరూ ఒకతల్లికడుపునబిడ్డల్లా అయ్యారు. అతడు దారి చూపించడం, ఆమె పాటపాడడం: అల్లా నాలుగేళ్లు గడిచినై.

౬

ఆరోజుసాయింత్రం కాల్వగట్టున వంట చేసుకుంటూ వుంది. పిల్లవాడు చితుకులు ఏరి తెచ్చి యిస్తున్నాడు. ఆసమయంలో ఆసంధ్యారుణకాంతుల్లో ఒకపురుషుడు ఆచెట్టుకిందికి వచ్చాడు. అతనిమొహం చిరునవ్వు నవ్వుతూ వుంది. కళ్లులేని ఆకబోది చెవులు, శరీరం, యావత్తూ అతిసున్నితమైన గ్రహణశక్తి సంపాదించుకున్నవి. ఆ కొత్తమనిషి రాక కనిపెట్టింది.

"ఒరే ఎవరురా ఆవచ్చింది?"

ఆపిల్లవాడు ఆమనిషిదగ్గిరకు పరుగెత్తుకుని వెళ్లాడు. అతనికుంటిచెయ్యి చూశాడు. పిల్లంగ్రోవి చూశాడు.

"ఆరోజుమనిషి."

ఆపిల్ల గ్రహించింది. ఆమె తెలతెల పోయింది. గుండె కొట్టుకుంది. తల వాల్చుకుని వంట చేస్తూనే వుంది.

ఆమనిషి పిల్లంగ్రోవి తీశాడు.

"ఏదిర లక్ష్మణ సీత
పర్ణశాలలో లే దెంతుశాత-"

అని పాట పాడినాడు. ఆ తేనెచుక్కల ధ్వని ఆసంధ్యఅంతా ఆక్రమించుకొంది. ఆపిల్లవాడు ఆతనిదగ్గిరగా జేరి మొహం చూస్తూ కూచున్నాడు. ఆ అమ్మాయి వంట చేస్తూనే వుంది.

"రారోరి చిన్నవాడా మావాడా
రారోరి చిన్నవాడ-"

చీకట్లు పూర్తిగా అలుముకు వస్తూ వున్నవి. నక్షత్రాలు మినుకుమినుకు మంటూ ఆకాశాన్ని అలంకరించాయి.

"ఎందుకైనా వ్రుంచినావురా బ్రంధికానాలో
రామయ్యతండ్రీ-"

ఆబాలిక వంట పూర్తి అయింది. నిప్పులు ఆర్పేసింది. బిచ్చగాడు ఆమె దగ్గిరగా పోయి కూచున్నాడు.

ఎడంచేయి మొండిది. అది పిల్లంగ్రోవికి నొక్కికొని కుడిచేతివేళ్లతో ఊదుతాడు.

"నీకూ నీవారు లేరు నాకూ నావారు లేరు
ఏటిబడ్డునా ఇల్లు కడదాం పదరా-"

ఆపాట అమృతమయంగా ఆచీకట్లలో వ్యాపించింది. కాల్వనీళ్లు నిర్మలంగా ప్రవహించినై.

"నాకు పెళ్లిలేదు. నేనూ ముష్టివాడినే. మనం యిద్దరం ఎందుకు పెళ్లి చేసికోకూడదు?"

ఆ అమ్మాయి ఆలోచించుకుంటూవుంది. వేయి ఆలోచన్లు పోయాయి. ఒళ్లు ఒణికింది. అప్రయత్నంగా అతని దగ్గిరకు జరిగింది. అతని మొహం తడిమింది. దేహం తడిమింది. ఆమనుష్యుడికి వళ్లు జలదరించింది. ఆచింపిగుడ్డ అమ్మాయి అప్సరస లా తోచింది. తనజీవితం జ్ఞాపకంవచ్చింది. ఒకగుడిలో దేవతకడ మోకారించిన భక్తు డయ్యాడు. ఆబాలికను గట్టిగా తనగుండెకు అదుముకుందా మనుకున్నాడు. చూపులేని ఆకళ్లు చూసి కళ్ల నీళ్లు నింపుకున్నాడు. ఆబాలిక ఆతని తల నిమిరింది. కళ్లు తుడిచింది. ఆతనిగుణగణాలు ఏలా అర్థమయ్యాయో!

"ఆపిల్లవాడు నాకు తమ్ముడు. చిన్నతనాన్నుంచి పెంచుకున్నా."

"నాకూ తమ్ముడే, నాబిడ్డడే అవుతాడు. ఇక్కణ్నుంచి నేను పెంచుకుంటా."

ఆ నక్షత్రాలే సాక్షిగా, పక్కన ప్రవహించే గోదావరినీరు సాక్షిగా వాళ్లిద్దరూ ఆ శుభముహూర్తంలో భార్యాభర్త లయ్యారు. ఒకళ్ల కౌగిలింతలో ఒకళ్లు కలిసిమెలిసి కరిగిపోయారు. ఆపసిపిల్లవాడు హృదయంతో "తథాస్తు"అని నవ్వుకున్నాడు.

---

దొరకు స్వాతంత్ర్యము, ప్రియ సుం
దరి కలుక, సమగ్రపురుషునకు శాంతగుణం,
బెఱిఁగినవానికిఁ బలుకుట,
మెఱుఁగని మొఱకునకు మౌనమే శోభించున్.

సుందరుఁడు. ౩-౮౧

ఘనమిఁ జెడ్డవారు గడియించు నాస్తికిఁ
బాత్రు లెవ్వ రట్టి వారె కాక?
వేపమ్రానఁ బండ్లు వెలసినఁ గాకులే
వచ్చి వానిఁ దినఁగవలయుఁగాదె?

పాలితుఁడు. ౩-౮౨

వడఁకి చెమరించు వ్రేళ్లకు వశముగాక
నిలిచి నడవక జాఱు సీకలము తోడ
స్వస్తిశబ్దమె ముగియింపఁ జాలనైతి
కమ్మ నింకేమి వ్రాయంగఁ గలను చెలియ?

అంధుఁడు. ౩-౮౮

ఇలను సుజను లొరుల కలుగనే యలుగరు;
అలిగిరేని చెడుగు దలఁప రాత్మ;
తలఁచిరేని వెలికిఁ బలుకఁబో; రొకవేళఁ
బలికిరేని సిగ్గుపడుదు రెపుడు.

అజ్ఞాతుఁడు ౩-౯౦

ఏనదియును నష్టమై పోవు నరులకు
దైవకరుణ కొంత తప్పెనేని;
ఏమిపనికిఁ దొడఁగిరేనియు మూలమే
కూడి కుదుర దిసుకగోడవోలె.

అంధుఁడు. ౩-౮౫

వలసినప్పుడు చేతిలోఁ గలదె ధనము;
వ్యసనములఁ జెంత విడువనివాఁడె సఖుఁడు;
అమలగుణములు లోఁగొన్నయదియ రూపు;
విదితధర్మంబు వీకనియదియె తెలివి.

హాలుఁడు. ౩-౯౧

అత్త! నేను దానమాడుచునుండ నా
నీటుకాఁడు వచ్చి యేటిదిగువ
పసపుఁజేదు నీరు పట్టి త్రావుచును నా
యుల్లమెల్లఁ గ్రోలె నొక్కమాఱు.

పోలదేవుఁడు. ౩-౮౬

కనుపాపల నరమూయుచుఁ
గొనగన్నులఁ జూచుచుండు కోడలి తెఱఁగున్
గని యజమానుఁడు వలద
న్నను, తెరువరి మందిరాంగణముననె విడిసెన్.

సుందరుఁడు. ౩-౯౪

చనిన యౌవనంబు వెనుకకు రాదు; జీ
వంబు చూడ శాశ్వతంబె కాదు;
ఒక్కనాఁడువోలె నొక్కనాఁ డుండదు;
జనుల కింత కటికతన మదేల?

హాలుఁడు. ౩-౮౭

పెనుఁగొండను బోలిన మను
జునినైనను రెండుపనులు చులుకపఱచుఁ; జే
యనిపని చెప్పుకొనుట, చే
సినకార్యము నొరులతోడఁ జెప్పుకొనుటయున్.

గోవిందస్వామి. ౩-౯౫

తడికసందులందు వెడలు నాకులతోడఁ
దరుణలతికి నామదంపుఁ జెట్టు,
'ఇచటఁ గాఁపుఁగోడ లింతింత లేసి పా
లిండ్ల దున్న'దని వచించుఁబోలె.

ఉద్ధవుఁడు. ౩-౫౭

ఎండుమఱ్ఱిమ్రాని యండకుఁ జేరి చ
ప్పట్లు చఱచి వగిరి పాంథు లపుడు,
తమ్ముఁ జూచి బెదరి దాపటియాకులపండ్ల
పగిది నున్న చిలుక లెగిరిపోవ.

అణులచ్చి. ౩-౬౩

తెలివియు గుణములు గల ని
ర్మలచరితులతోడి పగయు మంచిద; జననిం
దలపాలగు నల్పులతోఁ
జెలిమి పొసంగినను మాకు సిగ్గు పొడమెడున్.

సనగసత్తి. ౩-౬౭

తరుణి! నీమొగంబు దాఁకెడు సూర్యుని
జెఱఁగు పెట్టి యడ్డు సేయవలదు;
తామరయును నీదుమోమును దాఁకి యిం
కేది సుఖము వాని నెఱుఁగనిమ్ము!

తిలుఁడు. ౩-౬౮

ఏమి చెప్పనేర్తు నింతి చెల్వును! మాపు
దానిమేన నెందుఁ దగులుకొన్న
వెడలి రాదు మఱల, నడవఁజాలని పేద
గోవు బురదఁ జిక్కుకొన్నయట్లు.

పవ్వయకుమారుఁడు. ౩-౭౧

నీటిమీఁది వ్రాఁత నిజము దుర్జనమైత్రి
చేయుచుండఁగనె నశించుచుండు;
అదియు సజ్జనాళియందుఁ జల్పితిమేని
ఱాత గీసినట్టి గీఁత గాదె!

సరలుఁడు. ౩-౭౨

మఱల నింతలోన తరలిపోవఁగ నీకు
నెటులు పుట్టె మనసు? కటికవాఁడ!
తెరలుతెరలుగాఁగఁ దిరిగిన విపె చూడు
కురులు నేఁడుగూడఁ గుదురుకొనవు.

సరలుఁడు. ౩-౭౩

మేము వేఁడుకొనినమీఁద నల్క యొ!ంత
చల్లఁబడియె గాని, చాలసేపు
నీదు తప్పులను గణించుచు నిసుగేల
వ్రేళ్లు సాలకుండ వెలఁది యేడ్చె.

విణ్ణుఁడు. ౩-౭౦

పండుమాట యుండనిం డది దైవంబు
చేఁత; దాని కేమి చేయఁగలము?
ఇంత చెప్పనేర్తు; మెందు నశోకంపుఁ
జివురువంటి చివురు భువిని లేదు.

భవదేవుఁడు. ౩-౭౮

అనవరత బాష్పధారలు
కనుఁగడవలఁ దొరఁగుచుండఁగా నదిగో! మా
నిని, చెక్కులఁ దోఁచిన చం
ద్రునిమచ్చను గడుగురీతిఁ దోఁచెడుఁ గంటే!

విషమరాయుఁడు. ౩-౯౧

వేఱుపూలనరులు వేయింటిలో విర
జాజి యున్న దాని సౌరభంబు
పోదు సుమ్ము; పాడుపూవిది; దీని నె
త్తావి గుబులుకొను విధంబె వేఱు!

వియహుఁడు. ౩-౯౧

మానవంతుఁడైన దానిమనం బంత్య
దశలఁగూడ నున్నతంబె యగును;
మునిఁగి పోవువేళలను సూర్యకిరణముల్
మీఁది ప్రక్కఁగాదె మెఱయుచుండు.

మాపురాయుఁడు. ౩-౯౪

చదురునడత లేక, సత్యంబు నెఱిఁగిన
వారి లోఁగొనంగ వసము గాదు;
కడుగు నీరు ముందుగడఁ బెట్టి పాలంచుఁ
బ్రాఁతపిల్లి బేలుపఱుపఁగలదె?

భోజరాయఁడు. 3-౭౬

తెలిసి చని తమంతఁ దిని త్రాగవలసిన
పడవిగడ్డి మఱియు నడవినీరు
ఎట్టు లయ్యు వలపు లామరణాంతము
లేళ్ల కిట్టులకుఁ జలింప వవుర!

అనణాయరుఁడు. 3-౭౮

మాఁడ్చుచుండు గ్రీష్మమధ్యాహ్నమునఁ గూడ
ప్రేమబద్ధులైన కాముకులకు
బిగువుకౌఁగిలింత లగునట్లు, గంధంపుఁ
గలపములును జలువ గావు సూవె!

హరివృద్ధుఁడు. 3-౭౯

ఇంటిసత్తు వెఱిఁగియుంటఁ బేదలకోడ
లడఁచిపెట్టుకొనెడు నాత్మలోనె
బైలుపెట్టకుండ బైకలకోర్కి, బం
ధువులు చేసినట్టి దానఁగుఁబోలె.

విక్కిరుఁడు. 3-౯౧

జాఱుచుండెడు కొప్పును జీరముడియు
రెండుచేతులతో సవరించుకొనుచు,
మంగలిని జూచి వెఱచి పాఱంగఁ గొంగుకు
నంటి పరుగెత్తుచున్న డల్లాలు కంటె!

మాపూరాయఁడు. 3-౯౧

బట్టబయలె పరికించెదు;
గట్టిగ నూర్చెదును; మిన్నకయు నవ్వెదు; నె
లెట్టో పలికెదు; నేమో
పట్టినదర దీనిమదికి భావింపంగన్!

వియడ్డయింగుఁడు. 3-౯౬

చెవులకమ్మలనీలాల జిగులు దగిలి
దయితనునుఁజెక్కిళులఁ దోఁచు ధవళచంద్ర
కరములఁ బ్రియుండు కాటుక బెరసినట్టి
బాష్పములటంచు వ్రేళ్లతోఁ బాయఁదుడిచె!

కలసగంభుఁడు. ౪-౧

చక్కఁదనము గలుగు చానలు జగములో
నెంద అున్న నేమి? యింత వినుము;
ఒడలిచెలువునందు నెడమనగంబుతోఁ
గుడినగంబె సాటిగూడదుఁ జెలికి.

సిరిరాయఁడు. ౪-౩

నిలువఁగా రాని వలపుబందెమునఁ దగిలి
యతఁడు వాయించిన ట్లెల్ల వాడుచుండు;
మ్రాను సాజంపు ప్రోడైనఁ గాని తీఁగ
చొక్కి పెనఁగదె యద్దానిచుట్టుఁ జెలియ!

నసిప్పహా. ౪-౪

దొరకుట కష్టము దయితుఁడు;
దొరకియు వసమగుట మఱియు దుర్లభ; మింకన్
దొరకినను దొరకనట్టులె
తరుణీ! మనయిచ్చకొలఁదిఁ దా రాఁడేనిన్.

౪-౫

అనునయ సుఖము వలచి, చే
యనిపనియును జేసినట్లు లాడి యకట! కా
మిని, సరళహృదయుఁ డైనను
తనదయితుని దానె తప్పదారికి నీడ్చెన్.

సీహుఁడు. ౪-౬

'కడచె నిన్నినాళ్లుఁ గాలు సేతుల వ్రేళ్ళ
నొక్కటొక్కటిగాఁగ లెక్కపెట్టి
ఇంకమీఁద దినము లేమిటి లెక్కింతు?'
ననుచు నేడ్చుచున్న దకట! ముగుద.

పాలితుఁడు. ౪-౮

చిలుకముక్కు—వన్నె చే నొప్పమోదుగు
పూలపలువు పొలచె నేలనెల్ల,
బుద్ధదేవుచరణములు మ్రొక్క—c బుడమిపై
వాలియుండు భిక్షుజాలమట్లు.

సూరణుcడు. ౪-౯

పడcతి! నీదుమేన బలువులౌ నంగంబు
లెల్ల నిట్లు నన్నగిల్లె; నన్న
మైన వెల్లc బోచలై తోcచె; నింక నీ
పాడుకోప మిట్లు పట్ట నేల?

పలవుత్తుcడు. ౪-౧౦

తమకు వాడుకైన దాని మెత్తురు గాని
గుణము సూచి మెచ్చుకొనరు జనులు,
ముత్తియములు వదలి మోజుతో గురివింద
లేఱుకొనరె చెంచువార లడవి!

పమరిణసుcడు. ౪-౧౧

వడcకుచును గండవాడి తన
పిడికిటc గొని ప్రియునిమీcద వెదచల్లcగcబో
యెడుముగుదకుc జెమ్మట న
ప్పుడ కలపంబయ్యె హ స్తమున నదియెల్లన్.

కాంతఘరుcడు (?) ౪-౧౨

మగువ! పెరటింటి యూడుగుమ్రాని యాకు
పీపునకు నంటుకొనియె; దcల్చికొనవమ్మ!
జాణలగు తోడికోడండ్రు పైcచియుండ
రఱక నీ వేమిపాపము నెఱుcగకున్న.

పండి. ౪-౧౩

రెండుచేతులc గన్నులు రెండు వానిc
గాంచినప్పుడు కప్పుకోcగలను గాని,
చెలియ! మేనెల్లc గడిమి పూచిన విధాన
నుప్పతిల్లెడు పులకలc గప్పు టెట్లు?

వస్సీహుcడు. ౪-౧౪

[సశేషము]

---

## చక్రవాకి (విరహి)

కవితావినోద, అల్లంశెట్టి అప్పయ్య గారు

సాంద్రచంద్రాతపస్వచ్ఛసైకత ప్ర-దేశములయందు నిర్మలాకాశమందు
నెందువెదకినc గానరా దింతదైన-ప్రియునిజాడ; యిcకేమందు వెఱ్ఱినైతి.
కానcబడదయ్యె నాయెమ్మెకానిమోము-కటకటా! యెట్టిదుస్థితి గలిగె నాకు
ప్రియుcడులేకున్న నేడు జీవించు టెట్లు-యెవ్వరిని వేcడికొందు నేనెందcజొత్తు?
నవనవోల్లసితోత్పలయువతులార!-ముసుcగుగైకొన్న కెందమ్మి ముగుదలార
గగనసంచార పక్షిలోకమ్ములార!-కానరే మీరు నాప్రాణకాంతు నిపుడు
విరహవేదనచే డస్సి వివశనగుచుc-గన్ను లఱమోడ్చి నిద్రించుచున్న నన్నుc
బ్రియునిరాక యెఱింగించి భీతివాపి-చిరయశోలబ్ధి కింక రక్షింపరారె.

---



౧. వాణీవిలాసము సాగరము అనకట్ట (వెనుకప్రక్క)



౧. వాణీవిలాససాగరము ఆనకట్ట (ముందు ప్రక్క)




## "కూతూరక్కా"

ఒక పల్లెటూళ్లో ఒక పేదరాలు ఉండేది. ఆమెకు ఒకకూతురు తప్ప ఇంకెవ్వరూ లేరు. ఆ పిల్ల పేరు అక్కమ్మ. పేదరాలు ఆపిల్లని "అక్కా" అని పిలిచేది. మగదిక్కెవ్వరూ లేక పోవడంవల్ల ఆమె గ్రామంలో కూలినాలి చేసి, తనింత తిని, అక్కమ్మ కింత పెట్టి ఎలాగో కాలం గడిపేది. ఇలా ఉండగా, ఓనాడు ఒకగంపెడు ఇప్పపువ్వు వాకిట్లో ఎండబెట్టి అక్కమ్మని కాపలాఉంచి గ్రామంలోకికూలికి వెళ్లిందా పేద రాలు. దినమంతా కూలి చేసుకొని సాయంకా లానికి ఏవోకూలిగింజలు మూటకట్టుకొని ఇం టికి వచ్చింది. రోజంతా బాగాఎండి నల్లబడిన ఇప్పపువ్వు అంతా గంప కత్తేసరికి గంపెడు పువ్వూ గంపసగానికే వచ్చింది. పేదరాలు కూతురుమొహం చూసేసరికి ఆపిల్లమొహం కూడా వెలవెలపోయింది. పేదరాలికి అను మానం హెచ్చింది. రోజంతా కాపలాకాస్తూ పువ్వంతా తినేసిందని అక్కమ్మని చేతిలో ఉన్న ఊతకర్రతో గట్టిగా కొట్టి, "దొంగముండా! ఇంట్లోనుండి పైకిపో" అని పైకి పంపేసింది. అమాయకురాలైన అక్కమ్మకి తల్లిమాటలు బాధించేయి. సహింపలేని అవమానం కలిగింది. ఏడుస్తూ ఊరిబయటికి వెళ్లిపోయింది.

రాత్రి వచ్చింది. నిశ్శబ్దమైన ఊరిబయల్లో అక్కమ్మకి భయంవేసింది. అవమానం దుస్స హంగా బాధించడం వల్ల తననిస్సహాత్వాన్ని తలుచుకొంటూ ఒకనూతిలో పడి చచ్చిపో యిందా పిల్ల.

అదే మళ్లీ వస్తుంది కదా అనుకుంది పేద రాలు. కాని రాలేదు. మర్నాడుప్రొద్దున పేదరాలి కేమీ తోచక కూలికి వెళ్లలేదు. ఇప్పపువ్వు మరోగంపెడు ఎండబెట్టింది. తనే కా పలాకాస్తూ అక్కమ్మకోసం ఎదురు చూచింది. అక్కమ్మ రాలేదు. సాయంకాలమైంది. గంప కెత్తింది మళ్లీ పువ్వునంతాను. కాని మళ్లీనగా

నికే వచ్చింది. ఎండినందువల్ల పువ్వు తగ్గింది కదా అని అప్పు డామెకి తట్టింది. కూతుర్ని చేసిన అక్రమం జ్ఞాపకంవచ్చింది. ఎక్కడ లేని దుఃఖం పొంగిపొరలింది. వెంటనే కూతురు అక్కమ్మకోసం బయలుదేరిం దావిడ. ఊరం తా వెదకింది. అక్కమ్మ కనపడలేదు. రాత్రం తా వెదుకుతోం దా తల్లి చచ్చిపోయిన కూతు రుకోసం. తెల్లవారింది. నూతులూ గోతులూ అంతా వెదికేస్తోంది పేదరాలు. ఆఖరుకి అక్కమ్మ పడి చచ్చిపోయిన నూయి చూచింది. ఆ నిర్దోషియైన బిడ్డచచ్చి నీట్లో సగం తేల్తూంది. పేదరాలు కన్నులు తిరిగిపోయినవి. ఆదృశ్యా న్ని చూడలేక పోయింది. "కూతురా అక్కీ—" అని వెర్రికేకలేస్తూ అడివిలోకి పరుగెత్తింది. ఆమెమతి పోయింది. పిచ్చి దయింది. "కూతు రా అక్కీ—" అంటూ అడివల్లా తిరుగుతూ అడి విలో ఒక గువ్వపిట్టయిం దా పేదరాలు. అప్ప టినుండీ "కూతూరక్కీ—" అని అరుస్తు ఇప్పటి కీ అడివిలోనే ఉండి పోయిం దా గువ్వ పిట్ట. అప్పటిదాకా ప్రపంచంలో గువ్వపిట్టలు లేవు. అదే మొదలీ గువ్వజాతి పుట్టడానికి. గువ్వపిట్ట అరుపు బాగా గమనిస్తే "కూతూ రక్కీ—" అని స్పష్టంగా వినబడుతుంది.

వైశాఖి (కవితాసమితి)

---

# తెలుగు వారికి

ఎప్పటినుంచో పరంపరగా వస్తూ ఇప్పటికీ మన వృద్ధులు చెప్పతూ ఉండే పిట్టకథలవల్ల మనవారి సనాతనము లైన విశ్వాసాలూ, జాతీయమనోవిన్యాసాలూ అనేకము యథార్థముగా బోధపడుతవి. ఇవి మనము స్థిరముగా కాపాడుకోవలసిన జాతీయ సారస్వత సంపద. ఇటు వంటివే మన పాతవి పదాలూ, పాటలూ కూడాను. కాబట్టి అట్టి కథలు సొంత కల్పనలు చొన్పకుండా, పరిశుద్ధముగా,—ఉన్నవి ఉన్నట్టు, విన్నవి విన్నట్టు,—పంపినవారికి 'భారతి' కృతజ్ఞత చూపుతూ, వాటిని క్రమముగా ప్రకటిస్తూ ఉంటుంది. ఇప్పటి వృద్ధులతరము గడచి పోతే, తర్వాత అవి దక్కడము కష్టమై విస్మృతవాఙ్మయములో చేరిపోవడము నిశ్చయము. ఏవో కొన్నయినా పోకుండా ఉండాలని యీ ప్రయత్నము. —సంపాదకుఁడు.

---

# చీనా-రషియాల వైషమ్యము-యుద్ధసన్నాహములు

జయంతి వెంకటకిరీటిరావు గారు

"తూర్పుచీనా రైల్వేనుగూర్చి రషియా వారికిని చీనావారికిని నేడు కల్గిన సంఘర్షణము ఎన్నటికైనను రాక తప్పునది కాదు; ఆశియాఖండమున పెంపొందుచున్న జాతీయతా విజృంభణమునకు ఇది వేరొక నిదర్శనము."-గౌ. కె. ఎం. కెన్వర్ది గారు ఎం.పి.

పోయిన జూలయి మాసమున మంచూరియాలో సంభవించిన రషియా-చీనాసంఘర్షణమునుగూర్చి చర్చించుచు పార్లమెంటుసభ్యులగు కె. ఎం. కెన్వర్ది గారు పైవిధముగ దెల్పుటలో యథార్థమును వెల్లడించిరి. రషియను సోవియటు ప్రభుత్వమువారిచే పరిపాలించబడుచున్న రైలుమార్గమును చీనా ప్రభుత్వమువారు వశపరచుకొని, అచటనుండు సోవియటు ఉద్యోగులను తరుమగొట్టి, హార్బినుయందున్న సోవియటు ప్రతినిది కార్యాలయమును ముట్టడి జేసిరి. ఈచర్యకు సోవియటు ప్రభుత్వమువారు కినిసి, ఉభయదేశము లదివర కంగీకరించిన ఒడంబడికకు ఇది విరుద్ధమనియు, వెంటనే తమ దేశీయులను చెరనుండి విడువకున్నచో తగుచర్య గైకొందుమనియు, బెదరించుచు నాంకింగు (చీనా ముఖ్యస్థానము) ప్రభుత్వమునకు తాకీదు నంపిరి. దానికి ప్రత్యుత్తరముగ చీనాప్రభుత్వమువారు సోవియటు ఉద్యోగులు తమదేశమున కమ్యూనిస్టు ప్రచారము జేయుచుండుటచే బంధింపబడిరనియు, 1924 సం॥పు ఒడంబడికను రషియనులే నిర్లక్ష్యము జేసిరనియు, రషియాలో నిర్బంధింపబడిన చీనావారిని వెంటనే విడుదల చేయవలెననియు, ఉభయదేశముల సఖ్యమును గూర్చి చర్చింప తా మొక రాయబారివర్గమును రషియాకు పంపుచున్నామనియు వ్రాసిరి. ఈజవాబు సంతృప్తికరముగ లేనందున సోవియటు ప్రభుత్వమువారు యుద్ధ సన్నాహములు చేసిరి. ఉభయదేశముల సరిహద్దుప్రాంతమున చిన్న పోరాటములుగూడ జరిగినవి.

చీనాచరిత్రను గమనించుచుండిన ప్రతివారికిని ఈచర్య యించుక ఆశ్చర్యమును గల్గించకమానదు. దక్షిణచీనాయందు ప్రారంభమయి, కీ. శే. డా. సనుయటుసేనుగారి నాయకత్వమున మంచూవంశపు రాజులను పడగొట్టి ప్రజాస్వామ్యప్రభుత్వము స్థాపించిన జాతీయపక్షమునకు రషియామిగుల తోడ్పడెను. చీనాయొక్క జాతీయతాభివృద్ధియందును, యూరోపియనుల నిరంకుశాధికారము నెదుర్చుటయందును జాతీయపక్షము రషియా నాయకులవలనను సహాయమును పొంది యుండెను. పెకింగు నగరమునందు జాతీయ ప్రభుత్వము స్థాపింపబడి

పరరాజ్యములన్నింటిచే స్వక్రమప్రభుత్వమని గుర్తింపబడిన పిదప, ఒక్కమారుగ చీనాలో నున్న రషియాదేశీయులపై నిర్బంధచర్యలకు గడంగుట స్థూలదృష్టికి అక్రమముగనే దోచును. కాని కెన్వర్దీగారు చెప్పినట్లు ఆశియాయందలి జాతీయతావిజృంభణమున కిదియొక నిదర్శనముగ నెంచి అందుకు తగు కారణముల నరసినచో ఇందాశ్చర్యకరమగున దేదియు నగపడదు.

### జాతీయతాభివృద్ధి

పరిశ్రమాభిలాషులును ఒళ్ళువంచి పని జేయగల సమర్థులును అగు 400,000,000 మంది జనసంఖ్యగల చీనాజాతీయులు విదేశీయుల జోక్యములేకుండ స్వసమర్థతపై నాధారపడి యితరదేశీయులతో సరిసమానముగ నుండుటకు నిరంతరము కృషిజేయుచున్నారు. ఆశియాఖండమందలి అన్ని జాతుల కంటె నాగరికతయొక్క ప్రాచీనతయందును, జనసంఖ్య బాహుళ్యమునందును చీనావారే ప్రాధాన్యము వహింతురు. పడమటిజాతులఆక్రమణాభిలాష నరికట్టుటయందు చైనీయులు ముందంజవేసిరి. చీనాయందు వలెనే ఆశియాఖండ మంతటను జాతీయోద్యమము నానాటికి పెంపొందెను. విదేశీయులదాడి నెదుర్చుటయందేగాక ఆధునిక పద్ధతుల ననుసరించి ప్రాచీనసాంప్రదాయముల సంస్కరించి నూతనాభివృద్ధికిగూడ ఈ యుద్యమము తోడ్పడినది. పందొమ్మిదవ శతాబ్దపుచరిత్రయంతయు స్వాతంత్ర్య సంపాదనకై కావించిన ఆశియాజాతుల విఫలయత్నముల వర్ణనగ నెంచవచ్చును. ఇరువదియవ శతాబ్దము ప్రారంభము నుండియు చీనాయందును, ఇండియాయందును ఆయత్నములు ఎట్లు కొనసాగుచున్నవియు పాఠకులెఱింగినవిషయమే. కుమ్మరావమునందలి మట్టిని కుమ్మరి తన చిత్తము వచ్చిన రూపమున ప్రతిమల చేయుటకు ఎట్లు వినియోగించునో ప్రాగ్దేశములను అట్లు వినియోగింపవచ్చునని పడమటిజాతులవారు దలంచిరి. కాని యామట్టి యించుక కరకుతనము చూపగనే యూరపు అమెరికా దేశములు కినుకచెంది ప్రాగ్దేశీయులు తమయెడ కృతఘ్నత జూపుచున్నారనియు, వారివలన తమకెంతో ముప్పు వాటిల్లనున్నదనియు (Yellow Peril) ప్రచారము జేయసాగిరి. ప్రాక్పశ్చిమ సంఘర్షణము ఆశియాఖండమంతటిలో ఇతరదేశము లన్నింటికన్న చీనాయందే ప్రస్ఫుటము కాగలదు. ఆచరిత్ర వివరములన్నియు ఇదివరకు భారతి సంచికలందు వివరింపబడెను. *

### రషియా ప్రవర్తనము

నేటి రషియా చీనాతగవుగూడ ఈజాతీయోద్రేకముయొక్క చిహ్నమే. జూలయిలో జరిగిన చర్యలకు ప్రత్యేకకారణ మెట్టిదైనను మూలకారణము మాత్రము పాశ్చాత్యరాజ్యముల నిరంకుశప్రవర్తనయెడ చైనీయుల ప్రతిఘటనమే యని అంగీకరింపకతప్పదు. ఆశియాఖండమునందు ఇపుడు సోవియటు

* విభవసంవత్సర మార్గశీర్ష మాస సంచిక.

పరిపాలన క్రిందనున్న దేశమంతయు రషియా వారిది కాదు. ఇతర ఐరోపియను జాతులవలెనే రషియనులుగూడ క్రమేణ ఆక్రమించుకొనిరి. సైబేరియాలో నెక్కువ భాగము పూర్వము చీనాసామ్రాజ్యములోనిది. రషియనులు బలవంతముగ పైబడుటచే చీనా లోబడవలసివచ్చెను. చైనీయులు ఆయారాష్ట్రములపై హక్కులను అప్పటికి వదలుకొనిరి. కాని శాశ్వతముగ తమ దేశమును అన్యుల వశమొనర్చియూరకుందురని భావింపరాదు. మంగోలియారాష్ట్రమును ౧౯౧౧ సం॥ రషియనుజారు చక్రవర్తి వశపరచుకొనెను. అతని తదనంతర మేర్పడిన సోవియటు ప్రభుత్వమువారు చీనావారికీభాగమును విడిచిపెట్టుటకు బదులు మంగోలియాపై తమ అధికారమును దృఢపఱచుకొనిరి. తదనంతరము ౧౯౨౫ సం॥ న సోవియటు సైన్యములు మంగోలియానుండి తీసివేయబడినను మంగోలియామాత్రము చీనాప్రభుత్వముక్రింద నుండుటకు అంగీకరింపలేదు. సోవియటు ప్రభుత్వస్థానమగు మాస్కోనగరమున తనప్రతినిధి కార్యస్థానము నెలకొల్పెను. ఈరీతిగ రషియా మూలమున చీనా మంగోలియారాష్ట్రమును గోల్పోయెను.

ఇక చీనాలోని ఉత్తరభాగమగు మంచూరియారాష్ట్రము మూఁడు దేశములకు అభిలాషపాత్రముగ నుండెను. రషియను సరిహద్దునుండి సముద్రతీరము వరకునున్న యీ రాష్ట్రము నాక్రమించినచో అనుకూలమగు రేవుస్థలమును వశపరచుకొని వర్తకాభివృద్ధి చేసుకొనవలెనని రషియా యోచించెను. అపలేచిన్న దేశమయి అనేకవిధములగు వర్తకపరిశ్రమాభివృద్ధియు, జనసంఖ్యాభివృద్ధియు పొంది పాశ్చాత్య సామ్రాజ్యములతో సరిసమానముగనున్న జపాను విశాలరాష్ట్రమగు మంచూరియాను తనదిగ జేసికొనుటత్యంతావశ్యకముగ నెంచెను. చైనీయులు రాష్ట్రము తమదే యను భావముతో అందు ప్రవేశించి వ్యవసాయాభివృద్ధి గావించుచుండిరి. మంచూరియా రాష్ట్రాక్రమణవిషయమై చైనా జపాను రషియాలకు గత శతాబ్దాంతమున కొన్ని యుద్ధములు జరిగి, తత్ఫలితముగ ఉత్తరభాగము రషియావారికిని, దక్షిణభాగము జపాను వారికి చెందెను. మధ్యగనున్న ముక్డెనునగరము చుట్టుపట్లనుండు ప్రదేశము చైనీయుడగు సైన్యాధికారి చాంగుట్సొలినుగారి వశమునందుండెను. చాంగుట్సొలిను మరణించిన పిదప ౧౯౨౮ సం॥ న వీనికుమారుడగు చాంగుషులియాంగుగారు ఆప్రాంతమునకు గవర్నరుగనుండి నాంకిగు ప్రభుత్వాధికారమునకు వశమయిపోయెను. అందుచే మంచూరియాయందిపుడు నాంకింగు ప్రభుత్వమే స్థాపింపబడెను. ఈ నాంకింగు ప్రభుత్వమువారి ఉత్తరువు ప్రకారమే రషియావారి పరిపాలనయందున్న తూర్పుచీనా రైల్వే ఉద్యోగులగు సోవియటులు అరెస్టు చేయబడిరి.

తూర్పు చీనారైల్వే తగవు

ఈ రైలుమార్గమును జారుచక్రవర్తిగారు నిర్మించిరి. దీని ద్వారా రషియను సేన

లనుపంపి జాపానీయుల దాడి నరికట్టుచుండిరి. తాము వర్తకవ్యాపారములను సాగించి ధన లాభమును పొందుచుండిరి. చీనావారును జాపానువారును ఈమార్గమును వశపరచు కొనవలెనని చూచుచుండిరి. కాని సాధ్యపడ లేదు. జారుపరిపాలన అంతమొంది సోవియటు రిపబ్లికు స్థాపింపబడిన పిదప రషియావైఖరి మారుటచే ౧౯౨౪ సం॥న ఈరైల్వేవిషయ మున రషియా చీనాలమధ్య నొకసంధి జరి గెను. దాన్నిప్రకారము రైల్వే పరిపాలకవర్గము నందు సగముమంది చైనీయు లుండుట కంగీకరిం చబడెను (అదివరకు చైనీయులు లేనేలేరు). వివిధశాఖాధికారులు రషియా వారగుచో వారి దిగువనుండు అసిస్టెంటు యజమానులు చీనావారును, పైవారు చైనీయులయినచో అసిస్టెంటులు రషియనులుగను నుండవలెనని ఒడంబడికయందలి షరతు. ఈరీతిగ సమాన ప్రాతినిధ్యపు ఏర్పాటు జరిగినను సోవియటు ఉద్యోగులు అసమర్థులను కారణమున చైనీ యులనునియమించుట మానిరి. పరిపాలకవర్గము నందలి రషియాప్రతినిధులు సభలకు రాక సర్వాధికారమును రషియను మేనేజరుకు విడ చిపెట్టుచుండిరి. రైలుమార్గమును తమసైన్య ముల రవానాకు వినియోగించుకొనుచు, మం చూరియా ప్రభువగు చాంగ్ట్సొలినుగారు తమ సైన్యములకొరకు కోరినపుడు ధనమొసంగినను రైలుమార్గము నుపయోగించ నీయలేదు. అందుచే చాంగ్ట్సొలినుగా రున్నపుడే రైలు మార్గపు తగవు ప్రారంభమయ్యెను. పేరుకి పరిపాలనయందు చైనీయులుగూడ భాగస్వాము లయియున్నను, కార్యాచరణయందు శూన్య ముగ నుండెను. కావున చీనాప్రభుత్వమువారు సరిసమానాధికారమును కోరుచుండిరి. సోవి యటు ప్రభుత్వము సర్వాధికారము వహించి యుండెను. ప్రస్తుత తగవునకు ప్రత్యక్షకారణ మిదియేమైనను, పైన దెలిపినరీతి ఉభయజాతుల మధ్య వైషమ్యములు పెంపొందియుండుటచేత నేయీస్వల్పవిషయము యుద్ధకారణమయ్యెను. ఉభయరాజ్యములు ఒండొరులకు అంత్యసం దేశముల నంపి సంతృప్తిచెందక యుద్ధమునకు దిగినవిషయము ముందే వివరింపబడెను.

### ఇతర దేశముల వైఖరి

అయినను ఇంతమాత్రమున గొప్పయు ద్ధము జరుగునని యెవ్వ రెంచుటలేదు. ఎట్టి కమ్యూనిష్టు ప్రచారమునకై సోవియటుఉద్యో గులను శిక్షించుచున్నామని చెప్పుచున్నారో అట్టి కమ్యూనిష్టుల ప్రచారబలముననే ప్రస్తుత మధికారమునందున్న చీనా జాతీయపక్షము వారు నాంకింగు ప్రభుత్వ సంస్థాపనము చేయ గల్గిరి. పైకి కృతఘ్నతగ నగపడునట్టి యీ కార్యమునకు చైనీయులు గడంగుట బ్రిటిషు వారి రాజనీతితంత్రముయొక్క ఫలితమని కొం దరు ఎంచెదరు. ఏమన, బ్రిటీషు ప్రభుత్వము నకు సోవియటు ప్రభుత్వమునకు ఇపుడు సఖ్యముచెడి ఉభయదేశములందలి ప్రతినిధివర్గ కార్యాలయములు రద్దుచేయబడినందునను, (తిరిగి బ్రిటిషు కార్మికప్రభుత్వమువారు ఇటీ వల రషియాతో రాజకీయసఖ్యము నెలకొల్పిరి)

ఆంగ్లేయుడగు సర్ ఫ్రెడరికు వైటుగారు చీనా ప్రభుత్వమునకు రాజకీయ సలహాదారుగ నియమింపబడినందునను, అట్లు తలంచుటకు అవకాశము కలిగెను. కాని కేవలము బ్రిటీషు వారి ప్రేరేపణచే చీనాప్రభుత్వమిట్లు చేసెననుటకన్న చీనా రాజనీతిజ్ఞుల యుక్తినిగూర్చి యించుక యోచించుట ధర్మము. ఐరోపా మహాసంగ్రామమునందు చేరుటలో గూడ వారు ఇట్టి తెలివితేటలనే యగపరచిరి. చీనాకు లాభకరమగు కొన్ని షరతులకు మిత్రమండలివారి నంగీకరింపజేసిన పిదప యుద్ధమునందు పాల్గొనిరి. తత్ఫలితముగ అదివరకు జాపాను పలుకుబడియందున్న షాంటంగు రాష్ట్రము చీనావారికి సంపూర్ణముగ వశమయ్యెను. చీనాయందలి జర్మను అధికారము పూర్తిగ తొలగిపోయెను. ముందంగీకరించిన ప్రకారము అమెరికా బ్రిటిషు ప్రభుత్వముల వారు చీనాయందలి కొన్ని ప్రాంతములలో తమకుగల ప్రత్యేకసౌకర్యములను వీడకున్నచో అది వారిమోసమును వెల్లడిచేయునే గాని చీనానాయకుల అవివేకము ఎంతమాత్రము కాదు. చైనీయులు న్యాయమగు తమహక్కులను ఎన్నటికైన సాధించి తీరెదరు. ఇప్పుడు రషియా నెదుర్కొనుటలోగూడ చీనానాయకులు వివేకమును జూపిరనియే చెప్పవచ్చును.

రషియను ఉద్యోగులు చీనాలో కమ్యూనిష్టుప్రచారము చేయుచుండిరనుటలో కొంత సత్యము లేకపోలేదు. కుమింగుటాంగు (జాతీయ) పక్షమునందు ఈకమ్యూనిష్టుల ప్రాబల్యమధికమగుటచేతనే అతివాదులు కొందరు మితవాదులు కొందరుగ విభజింపబడెను. మితవాదులగు అధ్యక్షుడు చియాంగుకాయి షేకు గారు, విదేశాంగమంత్రి డా॥ సి. టి. వాంగార్ల అధికారము ప్రబలుటచే అతివాదులు ప్రక్కకు తొలగవలసివచ్చెను. తమలో తమకెట్టి కలహకారణమయినట్టి రషియాసంపర్కమును వదలుకొనుటయే మంచిదని చీనాఅధికారు లెంచిరి. ఉత్తమాధమ తరగతి తగవులను పెంపొందించుచు తమ ప్రత్యేకాధికారమును వీడక స్వలాభమును చూచుకొనుచుండిన రషియా నిష్పట్టుననే యెదుర్చుట యుక్తమని వారు దలంచిరి.

జపానుయొక్క వైఖరిని వారు బాగుగ గుర్తించియుందురు. మంచూరియా యందు జపాను యెన్నడును నిరంకుశముగ ప్రవర్తింప నేరదు. తనకుగూడ దక్షిణమున యొక రైలుమార్గ ముండుటచే చీనాప్రభుత్వమును ప్రక్కబెదురుతోనే చూచుచుండును. నేడు రషియా వంతయ్యెను. రేపు తనవంతగునని వెరగొందుచుండును. కాని రషియాకు మాత్రము జపాను ఎంతమాత్రము సహాయము చేయజాలదు. బ్రిటిషు అమెరికా ప్రభుత్వములు రషియా నేవగించుచునే యున్నవి. సోవియటు చర్యలు వేనిని సమర్థించలేదు. చీనాప్రభుత్వము వారు నౌకాదళనిర్మాణమొనర్చుటకై బ్రిటీషువారు తోడ్పడుచున్నారు. విమానదళనిర్మాణమునకై అమెరికా ధనసహాయముజేయ నంగీకరించెను. అందుచే చీనాప్రభుత్వాధికారులు

తమ కంతవరకు సహాయపడిన రషియాను త్రోసివేసి వైరము తెచ్చిపెట్టుకొనుటకు సంకోచింపలేదు. జాతీయదృక్పథము ననుసరించి యుక్తి యుక్తముగ ప్రవర్తించిరి. ఎల్లరిచే కంటగింపబడుచున్న రషియా సహాయముకన్న బలవత్తరమగు ఇంగ్లాండు అమెరికాలతో సఖ్యముగనుండుటయే సౌఖ్యప్రదమనితలంచిరి.

వర్తమాన పరిస్థితులను బట్టి చీనాప్రవర్తనము కొంత లాభకరముగ దోచినను ఆలాభము బహుస్వల్పమైనది. ఈసంఘుర్షణమునందు చీనావారే గెల్చినచో చీనాయొక్క ప్రతిభ యినుమడించు ననుటకు సందియము లేదు. రషియాయే గెలుపొందినచో అంతర్జాతీయ రాజకీయములందు రషియాకు విశేష ప్రాముఖ్యము వచ్చును. సోవియటు నెడల గల ద్వేషముతో అమెరికా ఇంగ్లాండులు చీనాపట్ల నెంత సుముఖముగనున్నను స్వలాభాపేక్షనువీడి ప్రవర్తింపజాలవు. తమకు ప్రత్యేకాధికారములుగల రాష్ట్రభాగములను వీడజాలవు. అవి వారు వీడినగాని, నానాటికి అభివృద్ధిచెంది అనేకవిధముల ప్రకాశించుచున్న చైనీయుల జాతీయోద్రేకము శాంతించి సంతృప్తిచేకూరదు. తుదకది ప్రాక్పశ్చిమ జాతుల తీవ్రసంఘర్షణగ కొనసాగ గలదు. అట్టి యుపద్రవ మేమియు వెంటనే సంభవించుటకు తగు చిహ్నము లగపడవు. చీనా రషియాలు రెండును జాతిసమితి సభ్యులగుటచేతను, అమెరికా ప్రారంభించిన యుద్ధనిషేధపు శాంతి ఒడంబడికయందు వివిధప్రాంతములవారు సంతకములు జేసినందునను, చీనాయందు వివిధదేశీయులకు సొంతబాధ్యత లేర్పడియున్నందునను, ఎల్లరు కలిసి యుద్ధము జరుగకుండ యత్నించెదరనియే విశ్వసింపవచ్చును. ముందేమి జరుగునో చూడవలసి యున్నది.

---

## నారి

వడ్డాది సీతారామాంజనేయులు గారు

వింటికి నారినాఁ బరిఢవిల్లును భర్తకు నారి; యొక్కచోఁ
గుంటుగ వంపు నొందియును గొప్ప యడంకువఁ జూపు; నింక న
ట్లుంటయె కాక లాఁగుకొనియుర్విఁ జెలువమ్ముగ వెంట నంటు; నీ
రెంట నమోఘబంధము గరిష్ఠము, శ్రేష్ఠముఁ గాదె రూఢిగన్.

"మణిద్వీపము."

---

# నిర్మలత, సరళత, సౌందర్యము

ఇవి అన్నియు మా వర్కుషాపునందు తయారైన ప్రతి వెండివస్తువునందు గాంచ నగును. ప్రతివస్తువు చేతితో తయారైనదే. స్వచ్ఛమైన వెండిచే తయారైనది. అందుమీద మా రిజష్టర్డు డైమండ్ ట్రేడ్‌మార్కు గలిగియుండును. అదియే దాని నిర్మలత్వమును సూచించును. పనితనము బహు చక్కగా నుండును.

పండుగ మహోత్సవములకు మీగృహమును మా వెండిసామానులతో నలంకరింపుడు. మీయింటికి నూతనప్రకాశమును, మీకు క్రొత్తవికాసము కలుగును.

మార్కెటునందు దొరకు యిదేమాదిరి వస్తువులకంటె మాచే తయారొనర్పబడినవి శ్రేష్ఠమైనవని మీరే కనుగొనెదరు. తూకమునకు తగ్గ పరిమాణములు గల్గియుండును.

# సురాజ్‌మల్ లల్లూభాయ్ అండు కో.,

## బంగారు, వెండివస్తువులు తయారొనర్చెడివారు,

## 313, ఎస్ప్లనేడ్, మద్రాసు

మా యితర ఆఫీసులు:

| బొంబాయి, | కలకత్తా, | రంగూన్, | తిరిచినాపల్లి. |
|---|---|---|---|
| 359, కల్బాదేవిరోడ్డు | 12, లాల్ బజారు వీధి | 134, మొగల్ వీధి | 135, బిగ్ బజారు వీధి |



మధుమాధవీ

జో బన ఫురి రహీ తన సుందరి పేడకే అంగన ఠాడీ రహీ హై ।
అంబర నీలమే హార సిగారని కంచూకీ కీత మ పోహ రహీ హై ।
చంచలా కో నమకీ పభీ ఛీరహ్యా ఖోనగకే ఛజ చౌకి చహీ హై ।
రహే మనుమాధవీ రాగనీ హిండోలకే రాగనీ చితకే చోపల హీ హై ॥

[జయపుర చిత్రము: దివాన్ బహాదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని.]

# హిందూదేశ ఆర్థికస్థితి

## కేంద్రరాష్ట్రప్రభుత్వముల ఆర్థికసంబంధములు

చావలి వెంకటహనుమంతరావుగారు, ఎమ్. ఏ.

కేంద్రరాష్ట్రీయప్రభుత్వముల మధ్య నుండవలసిన ఆర్థికసంబంధములను గూర్చి దేశమునందు తీవ్రమైన విచారణ చేయవలసిన సమయమే తెంచినది. ఒకప్రక్క సైమను విచారణ సంఘమువారు హిందూ దేశ రాజ్యాంగవిధానములో ఎట్టిమార్పులు చేయుటవసరమో విచారించి రిపోర్టుచేయుటకు సిద్ధముగ నున్నారు; వేరొకప్రక్క కాంగ్రెసువారు నెహ్రూరిపోర్టులో సూచింపబడిన పరిపాలనా విధానమును దేశీయులచే ఆమోదింపజేసి అమలునందుంచుటకు ప్రయత్నములు చేయుచున్నారు; వేరొకప్రక్క సైమను సంఘమునకు సహాయము చేయుట కేర్పరుపబడిన రాష్ట్రసంఘములు రాజ్యాంగ ఆర్థికవిధానములందు మార్పులు సూచించుచున్నారు. ఇట్టి సమయములో ఇప్పుడు రాష్ట్రకేంద్రప్రభుత్వములు ఎట్టికార్యములు చేయుట కేర్పాటున్నదో, ఏయే మార్గములనుండి ఏయేప్రభుత్వమునకు ఆదాయము వచ్చుచున్నదో, ఆ ఏర్పాట్లయందున్న మంచిచెడ్డ లేవో విచారించుటయు, ఇకముందు ఆ ఏర్పాట్లలో ఏవిధముగా మార్పులు చేయుటవసరమో చర్చించి నిర్ణయించుటయుఅవసరము.

ఇప్పుడున్న పరిస్థితులలో కేంద్రప్రభుత్వమువారి ఆదాయవ్యయములపై చివర యాజమాన్యము హిందూదేశమంత్రి చేతులయందును, ఆతనిద్వారా ఇంగ్లీషు పార్లమెంటువారి చేతులయందు నున్నది. ముఖ్యముగా ప్రభుత్వమునకు పన్నులవలన వచ్చు ఆదాయమును ఖర్చుపెట్టు విషయములో హిందూదేశమంత్రికి సంపూర్ణాధికారము కలదు. అట్లుండుట మన దేశమునకు చాల నష్టదాయకమనియు, దానిని మార్చుట ముఖ్యావసరమనియు వేరుగ చెప్పనక్కరలేదు. మన దేశాదాయమును మన ఇష్టమువచ్చినట్లు ఖర్చుపెట్టుకొనుటకు అధికారము లేకపోవుటవల్లను, ఆఅధికారము ఇంగ్లీషు మంత్రివర్గములోనివాడగు హిందూ దేశ మంత్రి చేతులలో నుండుటవల్లను మన దేశమునకు పూర్తిగా లాభదాయకము కానట్టియు, ఇంగ్లీషువారికి లాభ ముండునట్టియు పనులకు ఈ దేశపుసొమ్ము ఖర్చుపెట్టబడుటకు అవకాశములు చాల నుండును. కేంద్రశాసనసభ (Legislative Assembly) వారికి ఆర్థిక బిల్లు (Finance Bill) ను చర్చించుటకును, వోటు చేయుటకును అధికారమున్నది కాని వారి అభిప్రాయము ప్రకారము ప్రభుత్వమువారు నడుచుకొనునట్లు చేయుటకు ప్రస్తుత మమలునందున్న మాంటేగ్యు సంస్కరణముల క్రింద వారికి ఏవిధమైన అధికారమును లేదు. దానికి

మొదటి కారణము హిందూదేశ ఆర్థికబిల్లులో సైన్యమునకు ఖర్చుపెట్టు సొమ్మునుగురించియు, పరదేశములతో సంబంధము లుండుటవలన ఖర్చగు సొమ్మును గురించియు, పార్లమెంటు వారికే బాధ్యతగల కొన్ని ఉద్యోగములపై ఖర్చుపెట్టబడుసొమ్మును గురించియు అసెంబ్లీ వారికి వోటుచేయు అధికారమే లేదు. రెండవ కారణము గవర్నరు జనరలుగారు ఇతర విషయములనుగూర్చి తమసర్టిఫికేట్ (Certificate) అధికారము నుపయోగించి ఇష్టము వచ్చినట్లు పన్నులను ఎక్కువచేయుట, తగ్గించుట, తీసివేయుట, వాటివల్లవచ్చు సొమ్మును ఇష్టము వచ్చినట్లు ఖర్చుపెట్టుట మొదలగు పనులు జరుపవచ్చును. ఈ సర్టిఫికేట్ అధికారము అనేక సమయములలో ఇదివరకు ఉపయోగింపబడకపోవచ్చును; కాని కొన్ని సందిగ్ధమైనట్టియు, ముఖ్యమైనట్టియు సమయములలో తప్పక దాని నుపయోగించుట జరుగుచున్నది.

ఇక రాష్ట్రములలోనున్న పరిస్థితులను విచారించిన, వాటియందు 10 సంవత్సరముల నుండి ద్వంద్వప్రభుత్వ విధాన మమలునందున్నది. కొన్ని శాఖలపై అధికారము శాసనసభాసభ్యులలోనుండి ఏర్పరుపబడిన మంత్రులకును, మరికొన్ని శాఖలపై అధికారము ఇండియా ప్రభుత్వమువారికే జవాబుదారీగల కార్యనిర్వాహకవర్గ సభ్యులకును ఈయబడినది. మంత్రుల యధికారములోనున్న శాఖలన్నియు ఆదాయమును తక్కువగాగల్గి వ్యయము ఎక్కువచేయవలసినవై యున్నవి. ముఖ్యముగా విద్యాశాఖ, వ్యవసాయశాఖ, పశువుల ఆరోగ్యశాఖ, ఆరోగ్యశాఖ మంత్రులచేతులలో నున్న ప్రభుత్వశాఖలు. ఇవి ప్రజోపయుక్తములును, దేశాభ్యుదయమును పెంపొందించు శాఖలునై యున్నవి. వీటిపై దేశాదాయములలో నుండి ఎంత ఎక్కువసొమ్ము ఖర్చుపెట్టిన అంత ప్రజలకు, దేశమునకు లాభము కలుగును. కాని వాటిపై ఎంత సొమ్ము వ్యయ పరచవలెనో అంతయు వ్యయపర్చుటకు మంత్రులకు అవకాశములు లేవు. రాష్ట్రాదాయ మంతయు మొదటిరాష్ట్రీ ఆర్థికసభ్యుని చేతులలోనికి వచ్చును; ఆతడు ఏయే శాఖకు ఎంత ఖర్చు పెట్టవలెనో నిర్ణయించి ఆ ఆదాయమును విభజించును. ఆర్థికసభ్యుడు కార్యనిర్వాహకసంఘమునందొక సభ్యుడై యున్నాడు. ప్రజోపయుక్తములగు శాఖలకు మంత్రులు డబ్బు కావలెనని అడిగినప్పుడెల్లను ఈతడు తన బీదతనమును ప్రకటించుచు వారికోర్కెలను నిరాకరించుచుండును. ఈ పరిస్థితులలో రాష్ట్రములందలి మంత్రులు ఏమియు చేయలేనివా రయి ప్రజల అనిష్టతకు పాత్రులగుచున్నారు. ఇక ముందు పైన పేర్కొనబడిన ప్రజోపయోగము లగు కార్యములకు ఎక్కువడబ్బు ఖర్చు చేయవలసిన అగత్యము చాల గలదు. వాటిపై ఖర్చుచేయబడిన సొమ్మే ఎప్పటికైనను ప్రజలకు లాభము కల్గించునది. ఇప్పుడున్న పద్ధతి మారి రాష్ట్రప్రభుత్వములు తమ ఆదాయము

లను సరియైన పనులకు ఖర్చుచేయుట కవకాశ ములుండవలెనన్న రెండు ముఖ్యమైనమార్పులు జరుగవలసి యున్నవి. ఒకటి, రాష్ట్రములకు పన్నులను విధించుట : వాటివల్ల వచ్చు ఆదాయమును ఖర్చుపెట్టుటకును సంపూర్ణ ఆర్థిక స్వాతంత్ర్య మీయబడవలెను. రెండవది, ద్వంద్వప్రభుత్వవిధానము(Dyarchy)అంతరింప జేయబడి అన్ని ప్రభుత్వశాఖలును ప్రజలచే ఎన్నుకొనబడిన శాసనసభకు బాధ్యులై యుండు మంత్రులయాజమాన్యముక్రింద నుంచ బడవలెను. అనగా సంపూర్ణరాష్ట్రీయ స్వాతంత్ర్యము (Provincial Autonomy) ఏర్పాటు చేయబడవలెను. సంయుక్త రాష్ట్రములైన (Federation) అన్ని దేశము లందును ఇట్టి ఏర్పాట్లు చేయు టవసరమని ఇతర దేశముల పరిస్థితులు గమనించిన బోధపడును.

సంపూర్ణరాష్ట్రీయ స్వాతంత్ర్య మున్న కాని రాష్ట్రాదాయములను సరియగు ప్రజోప యుక్తములగు విద్యావ్యాప్తి, వ్యవసాయాభి వృద్ధి, ఆరోగ్య సంరక్షణ, పారిశ్రామికాభివృద్ధి మొదలగు కార్యములకు వినియోగించుట కవ కాశము లుండవు. ప్రపంచమందలి ఇతర దేశ ములతో మన దేశపరిస్థితులు సరిపోల్చిచూచిన మన దేశమునం దీపనులకై వెచ్చింపబడుచున్న ద్రవ్యము చాల తక్కువ యని చెప్పక తప్పదు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వములకు కల్సి వచ్చు సుమారు 220 కోట్ల రూపాయల సంవత్స రాదాయములో ఒక 22 కోట్ల రూపాయలు మాత్రము విద్యావ్యాప్తికై ప్రభుత్వమువారు ఖర్చుపెట్టుచున్నారని చెప్పిన దేశమునకు మొత్తముమీద లాభకరమగు పనులకు ఎంత తక్కువ ఖర్చగుచున్నదో విశదమగును. ఇది వరలో ప్రభుత్వమువారీవిషయములపై ఏవిధ మైనశ్రద్ధ తీసికొనలేదనియే చెప్పవచ్చును. కాని మాంటాగ్యు సంస్కరణములు ప్రవేశ పెట్టబడినతరువాత వాటిని గూర్చి ఎక్కువ శ్రద్ధ తీసికొనబడుచున్నట్లు సూచనలు కన్పించు చున్నవి. కాని పైన ఈయబడిన అంకెల (1926-27 సంవత్సరమునకు సంబంధించినవి) వలన ఇప్పుడుకూడ వాటిని గురించి తగినంత విచారణ జరిగియుండలేదనియే చెప్పవచ్చును. మున్ముందు రాబోవు సంస్కరణములలో రాష్ట్రీయ స్వాతంత్ర్యము తప్పక ఏర్పాటు చేయబడునను విషయములో ఎల్లరు నేకీభ వించుచున్నారు. సైమను కమీషనువారుకూడ ఇతరమార్పులు ఏమి సూచించినను సూచింప కున్నను, రాష్ట్రీయ స్వాతంత్ర్యమును మా త్రము సిఫారసుచేసెదరనుటకు నిదర్శనములు కలవు. రాష్ట్రీయ స్వాతంత్ర్యము సంపూర్ణ ముగ ఏర్పాటుచేయుటకు పూర్వము కేంద్ర రాష్ట్రీయప్రభుత్వముల ఆదాయవ్యయ మార్గ ములు స్పష్టీకరింపబడి నిర్వచింపబడుట చాల ముఖ్యము.

సంయుక్తరాజ్య విధానములు (Federal Constitutions) గల దేశములలో ఈ నిర్వచన చేయుట ప్రధానమైన మొదటి సూత్రము.

కొన్ని ఫెడరేషన్లలో, అనగా కనడా ఆస్ట్రేలియా మొదలగు దేశములలో, ఇట్టి విభజన యుండినప్పటికిని చివర యాజమాన్యము (Final Authority) కేంద్రప్రభుత్వమువారి చేతులలో నున్నది. అమెరికా, స్విట్జర్లండు, జర్మనీదేశములలో సంయుక్తమైన పరగణాల చేతులలోనే చివర యాజమాన్య మున్నది. కాని అన్ని దేశములంకెను వీలైనంత సంపూర్ణముగ శాఖాధికారముల విభజన కేంద్ర రాష్ట్ర లేక పరగణాల ప్రభుత్వముల మధ్య ఏర్పాటుచేయబడినది. ఇప్పుడు ప్రపంచమందలి ఇతర దేశములలో జరుగుచున్న విషయములో ఒక ముఖ్యసూత్రము గమనింపవచ్చును. అది ఏదన: ఆర్థికవిషయము లందు రాష్ట్రములకు ఎక్కువఅధికారము (Financial De-centralization) నిచ్చుట, రాజ్యాంగ విషయములందు కేంద్రప్రభుత్వమున కెక్కువ అధికారము నిచ్చుట (Administrative Centralization). హిందూ దేశమునందుకూడ ఈసూత్రము ప్రభుత్వమువారిచే అంగీకరింపబడినది. 1871 సంవత్సరములో మొట్టమొదటిసారి ఈసూత్రమును అప్పటి గవర్నరుజనరల్ లగు లార్డు మేయో (Lord Mayo)గారు ఆచరణలోనికితెసికొనివచ్చిరి. అప్పటినుండియు ఈసూత్రమును సంపూర్ణముగ ఆచరణలోనికి తెచ్చుటకును, రాష్ట్రకేంద్ర ప్రభుత్వములమధ్య ఆర్థికవిభజన ఏర్పాటు చేయుటకును అనేక ప్రయత్నములు జరిగినవి. చాల కాలమువరకు కేంద్రప్రభుత్వమువారు రాష్ట్రప్రభుత్వమువారికి కొన్ని శాఖలపై అధికారము నిచ్చి ఆ శాఖలపై వచ్చు ఆదాయమును వారి ప్రత్యేకావసరములను బట్టి ఖర్చు పెట్టుకొన వచ్చునని చెప్పిరి. కొంతకాల మైనతరువాత ఈపద్ధతిని మార్చి రాష్ట్ర ప్రభుత్వములకు కొన్నిపన్నులు విధించుటకును, వాటివలన వచ్చు ఆదాయమును ఖర్చు పెట్టుకొనుచు ఇంకను ఎక్కువసొమ్ము కావలసి వచ్చిన కేంద్రప్రభుత్వము వారిచ్చునట్లును ఏర్పాటు చేయబడెను. రాష్ట్రములకు పన్నులపై వచ్చు ఆదాయములో కొంతభాగము కేంద్రప్రభుత్వము వారి కిచ్చుచుండవలెనని కూడ ఏర్పాటు చేయబడెను. 1912 సంవత్సరములో ఈ విషయమై పునర్విచారణ చేయబడి ఇదివరలో కన్న ఎక్కువశాఖలను రాష్ట్రప్రభుత్వముల యాజమాన్యముక్రింద చేర్చుటకు నిశ్చయింపబడెను. కాని వాటిఖర్చు వచ్చు ఆదాయము కన్న ఎక్కువగా నుండుటచే కేంద్రప్రభుత్వమువారు ఆలోటును పూడ్చుటకు కొంత సొమ్మును ప్రతిరాష్ట్రప్రభుత్వమునకు ఈయవలసిన అవసరము కలుగుచుండెను. చివరకు 1919 సంవత్సరమునందు ఏర్పాటు చేయబడిన మాంటేగ్యు సంస్కరణముల సమయములో ఈ సమస్యను పూర్తిగ విచారణ చేయుటకును, శాశ్వతమైన ఏర్పాటొకటి సూచించుటకును ప్రభుత్వము వారు మెస్టను ప్రభువుయొక్క అధ్యక్షత క్రింద నొక సంఘము నేర్పాటు చేసిరి. ఆ సంఘమువారు చేసిన సిఫారసులపైననే ఇప్పటి ఆర్థిక విభజన

ఏర్పాటై యున్నది. ఆ సిఫారసు లేవో, వాటి మంచిచెడ్డ లేవో వేరొకచో చర్చించెదము.

ఇంతకుపైన రాష్ట్రములు ప్రజోపయుక్తములగు శాఖలను పరిపాలింపవలసి యుండుననియు, అట్టి శాఖలపై ఎంత ఎక్కువ ఖర్చు చేసిన అంత ప్రజలకు లాభములుండుననియు చెప్పియుంటిమి. అట్టి శాఖలను రాష్ట్రముల పరిపాలనక్రింద నుంచుటవలన అనేక ప్రయోజనము లుండును. ఒకటి: రాష్ట్రములు కేంద్రప్రభుత్వముకన్న తక్కువ రాజ్యభాగములపై అధికారము కలిగియుండుటచే రాష్ట్రాధికారులకు ప్రజలతో ఎక్కువసంబంధము కలిగియుండుట కవకాశము లుండును. రెండవది: ప్రజాదృష్టి ననుసరించి ఏ విషయములు ఎక్కువ అవసరములో, ఏ విధముగా సొమ్ము ఖర్చుపెట్టిన ప్రజలకు ఎక్కువ లాభము కలుగునో తెలిసికొనుటకు రాష్ట్రాధికారులకు వలె ఇతరులకు వీల్లుండవు. మూడవది: ప్రజలు తమకష్టసుఖములను శీఘ్రముగను, తేలికగను ప్రభుత్వమువారికి తెలియపర్చుకొనవలె ననిన రాష్ట్రప్రభుత్వమువారికి తెలుపుకొనుట కున్న అవకాశములు కేంద్రప్రభుత్వమువారికి తెలుపుకొనుట కుండవు. నాల్గవది: వేర్వేరు రాష్ట్రములలో వేర్వేరుపరిస్థితు లున్నవి. వాటి నన్నిటిని సమగ్రముగ విచారించి తగిన దోహదము చేయుటకు రాష్ట్రీయప్రభుత్వముల కున్న యవకాశములు కేంద్రప్రభుత్వమువారి కుండవనుట సామాన్యవిషయము. ఈ కారణముల నన్నిటినిబట్టియు ప్రజాసంబంధ మెక్కువగ నున్న శాఖలను ప్రజాప్రతినిధిసభకు బాధ్యులగు మంత్రులచే పరిపాలింపబడు రాష్ట్రములకే ఇచ్చుట ఎక్కువ సమంజసముగా నుండును. ఇతర దేశముల రాజకీయవిధానములను (Constitution) పరీక్షజేసి చూచినచో మనము చర్చించుచున్న ఈ అధికారము లా దేశములందుగూడ రాష్ట్రముల చేతులలోనికే వదలబడినట్లు కనుగొందుము.

ఇంక కేంద్ర ప్రభుత్వమువారి కెట్టి అధికారములుండవలెనను విషయ మాలోచించిన ఈక్రిందివిషయములు స్పష్టపడును. మొదటిది: దేశమున కంతకును సంబంధ ముండునట్టియు, దేశము మొత్తముమీద లాభకరముగ నుండునట్టియు పనులను చేయు అధికారము కేంద్ర ప్రభుత్వమువారి చేతులలో నుండవలెను. వారికి వచ్చు ఆదాయముకూడ దేశమందలి ప్రజలందరకును ఒకేమోస్తరుగ విధించుటకు వీలైన పన్నులవలన వచ్చున ట్లేర్పాటు చేయబడవలెను. ఈ ప్రధానసూత్రముల నాధారము చేసికొని ఆలోచించిన కేంద్రప్రభుత్వము వారి చేతులలో నుండవలసినవాటిలో మొదటిదియు, అన్నిటికంటె ముఖ్యమైనదియు దేశసంరక్షణమై యున్నది. దేశములో శాంతి నెలకొల్పుటయును, పై దేశములవారి బారినుండి దేశమును సంరక్షించుటయును కేంద్రప్రభుత్వము వారి ప్రధాన కార్యము. రెండవది: పరరాజ్యములతో రాయబారములు మొదలగునవి జరు

పుట, విదేశములలో భారతీయుల హక్కులను కాపాడుట మున్నగు విదేశాంగ వ్యవహారము లన్నియు (Foreign Affairs) కేంద్రప్రభుత్వము వారు జరుపవలసినవే. మూడవది: వర్తక వ్యాపార విషయములు: దిగుమతి ఎగుమతి పన్నులను విధించుట, వర్తక వ్యాపారము బాగుగ జరుగునట్లు చూచుట, వర్తకులకు లాభదాయకమగువిధానము నేర్పాటుచేయుట అను ఈవిషయము లన్నియు ఆ ప్రభుత్వము వారి యాజమాన్యము క్రింద నుండవలెను. నాలుగవది: నాణెములు, కరెన్సీనోట్లు, వాటికి సంబంధించిన ఇతరవిషయము లన్నియు దేశమున కంతకును సంబంధించిన వగుటచే కేంద్ర ప్రభుత్వమువారి క్రిందనే యుండుట మంచిది. ఐదు: రైలుమార్గములు, సముద్రవ్యాపారము మొదలగునవి కూడ వారిక్రిందనే యుండుట సమంజసము పనివారలసమస్య (Labour Problems) ఇంతవరకు మనదేశమం దెక్కువ ప్రాముఖ్యము వహించనప్పటికిని త్వరలో చాల ప్రాముఖ్యమునకు వచ్చుననుటలో సందేహము లేదు. ఆసమస్యను దూరదృష్టితోడను, పట్టుదల తోడను నిర్వహింపవలసిన బాధ్యత కేంద్రప్రభుత్వమువారిపైననే పడును. ఇవి కాక ప్రస్తుతము రాష్ట్రప్రభుత్వముల యధికారముక్రింద నున్న పోలీసున్యాయశాఖలుకూడ భారతప్రభుత్వము వారిక్రిందనే యుండిన పరిపాలనాదృక్పథము నుండి అనేక లాభము లుండును. ఈ ప్రభుత్వ శాఖలను బాగుగ పరిపాలించు భారము కేంద్రప్రభుత్వమువారి భుజములపై నున్నది. ఆ భారము వారు నిర్విఘ్నముగ మోయుటకును, దేశమునకు లాభము చేకూర్చుటకును వారికి పుష్కలముగ, కాని అధికము కాకుండ, నుండు ఆదాయమార్గముల (Sources of Revenue) నేర్పాటుచేయుట ముఖ్యము. ఏయే ఆదాయమార్గములు వారికీయవలెనో క్రింద విపులముగ సూచింపబడును. ఇచ్చట సూక్ష్మముగ వాటిని పొందుపరచెదము. ఇప్పుడు కేంద్రప్రభుత్వమువారికి ముఖ్యమైన ఆదాయమార్గములు (1) ఎగుమతి దిగుమతి పన్నులు; (2) ఆదాయపు పన్ను; (3) ఉప్పు నల్లమందు పన్నులు; (4) రైలుమార్గములవల్ల వచ్చుఆదాయము; (5) పోస్టుటెలిగ్రాఫ్ శాఖవల్లలాభము నైయున్నవి. ఇవిగాక క్రొత్తగ వారిచేతులలోని కిచ్చిన లాభముగ నుండునవి: (1) వ్యాపారపుస్టాంపుల (Commercial Stamps) పై వచ్చు ఆదాయము; (2) ఆబ్కారీశాఖనుండి వచ్చు ఆదాయము. వీటికి ప్రత్యామ్నాయముగ కేంద్రప్రభుత్వము వారు ఆదాయపుపన్ను (Income Tax) ను రాష్ట్రములకీయవలసియుండును.

రాష్ట్రప్రభుత్వముల కుండవలసిన అధికారము ఈక్రిందివిధముగ నుండవలెను; అనగా వారి కీక్రిందిశాఖలపై యాజమాన్య మీయవలెను: (1) భూమిపన్ను; (2) విద్యాశాఖ; (3) రోడ్లు, బాటలు; (4) వ్యవసాయపుశాఖ; (5) పశువులు; (6) రిజిస్ట్రేషన్; (7) వృత్తులు, చేతి పనులు; (8) ఆరోగ్యశాఖ, మొదలగునవి. ఇప్పటి విధానము ప్రకారము పోలీసు, న్యాయ, ఆబ్కారీశాఖలు కూడ రాష్ట్రప్రభుత్వముల

చేతులయందే యున్నవి. కాని పైన సూచించిన ప్రకార మీమూడుశాఖలును కేంద్రప్రభుత్వమువారి యాజమాన్యమునకు మార్చుట మంచిది. వాటికి బదులు ఆదాయపు పన్నుశాఖను రాష్ట్రప్రభుత్వములకు చేర్చుటవసరము. ఇంక ఈ రాష్ట్రప్రభుత్వముల కేయే ఆదాయమార్గము లుండవలెనో ఆలోచింతము. ఇప్పు డున్న ప్రకారమే లాండు రెవెన్యూ (Land Revenue) లేక భూమిపన్ను ఆప్రభుత్వములకు ముఖ్యాధారమై యుండును. దానికి పైగా ప్రస్తుతము కేంద్ర ప్రభుత్వమున కీయబడిన ఆదాయపుపన్ను, రిజిస్ట్రేషన్ పన్నులు, కోర్టుఫీజుస్టాంపులవల్ల ఆదాయము, సీటిపన్ను, ఇవికూడ రాష్ట్రములకు ఆదాయమార్గములై యుండును. వీటికి బదులు ఇప్పుడు రాష్ట్రప్రభుత్వశాఖగా నున్నట్టియు,సంవత్సరమునకు 20 కోట్ల ఆదాయము నిచ్చుచున్నట్టియు అబ్కారీశాఖ కేంద్ర ప్రభుత్వము వారికి మార్పు చేయబడును. ఇటుపైన వీటి నన్నిటిని గూర్చి కొంత బాహుళ్యముగ చర్చింతము.

ఇప్పుడు ఏప్రభుత్వమున కేయే శాఖలపై అధికార ముండవలెనో తేలినది. ఆయా శాఖలనుసరియైనమార్గమున పరిపాలించుటకు తగిన ఆర్థికబల మున్న కాని ప్రయోజనము లేదు. ప్రపంచకములో ఏపనికాని ఆర్థికశక్తి లేనిదే కొనసాగ నేరదు. అందునను ప్రభుత్వ నిర్వాహణమునిర్విఘ్నముగ కొనసాగవలెనన్నను దాని వలన ప్రజల శ్రేయములు పెంపొందవలెననినను ప్రభుత్వమువారి చేతులలో పుష్కలముగ డబ్బుండవలెను. అట్లు లేకపోయినను, ఉన్నడబ్బును సరియైన మార్గములలో ఖర్చు చేయకపోయినను ప్రజాసామాన్యమునకు తీరని నష్టము సంప్రాప్తమగును. అట్లగుటతో ప్రభుత్వములు రెండుచేతుల అప్పు చేయవలసి వచ్చుటయు, చివరకు గొప్ప అల్లకల్లోల మగుటయు జరుగును. ఈ విషయములు మనస్సునందుంచుకొని ఆర్థికములగు ఏర్పాట్లను చేయవలసిన బాధ్యత గలదు. పైన సూచింపబడిన మార్గములు ఈ సూత్రముల ననుసరించి సూచింపబడినవే.

మన దేశమందు కేంద్రరాష్ట్రీయఆదాయవ్యయ విధానములకు సంబంధించిన ఏ విచారణగాని సుమారు మూడవవంతు ప్రదేశము నాక్రమించుచున్న స్వదేశసంస్థానముల వేరు జేసి జరుపబడినయెడల సంపూర్ణముగ పరిగణింపబడ నేరదు. స్వదేశసంస్థానముల ఆంతర్య ఆర్థికస్థితిగతులతో మనకు సంబంధము లేదు. కాని, ఇండియా ప్రభుత్వపు ఆర్థిక విధానమునకును వాటికిని ఎట్టి సంబంధ ముండవలెను, ఈ ఆర్థికప్రణాళికయందు వారిస్థానము నెట్లు నిర్వచించి నిర్ణయము చేయవలెనను నంశములు మాత్రము చర్చనీయములు. ఇంతవరకును అట్టిచర్చకు తగిన అవకాశము లుండియుండలేదు కాని ఈ మధ్యను ప్రభుత్వమువారిచే నేర్పాటుచేయబడిన బట్లరు కమిటీ (Butler-

committee) వారి విచారణసందర్భములో ఈ విషయములు ప్రాముఖ్యము వహించినవి. దీనికి సంబంధించిన ప్రధాన మూలసూత్రములను కొన్నిటిని తెలిసికొనుట ముఖ్యము. (1) బ్రిటిష్ ఇండియా (British India) లోని ప్రజలకును సంస్థానప్రజలకును ఒకే విధమగు ఎగుమతి దిగుమతి సుంకములు సరుకులపై విధింపబడి, ఆసుంకముల నందరును కలసి చెల్లించుచున్నను వాటివలన వచ్చు ఆదాయమంతయు ఇండియాప్రభుత్వమువారికే చలామణీ యగుచున్నది. (2) నల్లమందు, ఉప్పు మొదలగు ఇండియాప్రభుత్వమువారికి సంపూర్ణ మనాపలీ (Monopoly) గలవస్తువులపై వచ్చు ఆదాయమంతయు ఆ ప్రభుత్వమువారే పుచ్చుకొనుచున్నారుగాని ఆవస్తువులలో కొంతభాగమును పండించునట్టియు, కొనునట్టియు సంస్థాన ప్రజలకు దానియందలి భాగమును పంచి ఇచ్చుట లేదు. (3) ఒక్క హైదరాబాదుసంస్థానములో తప్ప ఇతరచోట్ల ఎచ్చటను ఆ సంస్థానములకు ప్రత్యేకమగు నాణెములు, కరెన్సీనోట్లుఅమలునందు లేవు. బ్రిటిష్ ఇండియాలోనిరూపాయిలు, కరెన్సీనోట్లే అచ్చటగూడ చలామణి యగుచున్నవి. దానివలన వచ్చుచున్నకష్టనిష్ఠురములన్నియు బ్రిటిష్ ఇండియా ప్రజలవలెనే వారుకూడ వారి కేమియు అవసరము లేనప్పటికిని అనుభవించుచున్నారు. అనగా రూపాయివిలువ ఎక్కువఅయినను, తక్కువ అయినను, కరెన్సీనోట్లు విలువగలవైనను, వట్టి కాగితము లేయైనను వారుకూడ వాటినే ఉపయోగించవలసి వచ్చుచున్నది. (4) స్వదేశ సంస్థానములలో గల రైల్వేలు, పోస్టలుశాఖల వలన వచ్చు ఆదాయము కూడ కేంద్రఇండియాప్రభుత్వమువారి ఖజానాలోనికే పోవుచున్నది. హైదరాబాదు మున్నగు కొన్నిసంస్థానములలో వారి ప్రత్యేక పోస్టలుశాఖయు, మైసూరు, హైదరాబాదు వంటి వాటిలో ప్రత్యేకరైలుమార్గము లున్న మాట నిజమే కాని వాటియందుకూడ బ్రిటిషు ప్రభుత్వమువారికి పూర్తిగ అధికారము లేకపోలేదు. హైదరాబాదుసంస్థానములో బ్రిటిష్ పోస్టలుశాఖ యున్నది; మైసూరు రైల్వేలలో ఇండియా ప్రభుత్వమువారికి కొన్ని వాటాలున్నవి.

ఇంత ఆదాయమును సంస్థానముల వారి నుండి పొందుచున్నందులకు వారికి ఇండియా ప్రభుత్వమువలన కలుగుచున్న ఎదిరి లాభమేమి? ఇండియా ప్రభుత్వమువారు చెప్పునదేమన, సంస్థానములను వారిపైశత్రువుల నుండి కాచుచున్నామనియు వారికి, సైన్యపు ఖర్చు లేకుండ చేసితిమనియును. కాని ప్రత్యేకముగ వారికి సైన్యపు ఖర్చు లేకపోయినప్పటికిని, బ్రిటిష్‌సైన్యములలో కొంతకొంత భాగమును ప్రతి సంస్థానమును తన సొంత ఖర్చుమీద భరించుచునే యున్నది. ఈ సందర్భములో సంస్థానప్రజలును, ప్రభుత్వములును తమకు వర్తమాన ఆర్థికపుపర్యాటవలన చాలనష్టము కల్గుచున్నదని చెప్పుటలో ఆశ్చర్యము లేదు. వారు చేయుచున్న త్యాగమునకు తగిన ప్రతిఫలమువచ్చుట లేదనుమాట నిజము. ఈపరిస్థి

తులలో రెండుపార్టీలవారికిని అంగీకృతమును, న్యాయబద్ధమైనదియు నగు పద్ధతి నొకదాని నేర్పాటుచేయుట ముఖ్యము. ఈసందర్భములో అనేకసూచనలు చేయబడినవి కాని అన్నిటి కంటెను ఎక్కువ అనుకూలమును, ఎక్కువ మందిచేత ఆమోదింపబడినదియు ఏదన, ఇండియా ప్రభుత్వము సంస్థానప్రభుత్వములకు ప్రాతినిధ్యము కల ఎగుమతి దిగుమతి పన్నుల సంఘము (Customs Union)నొకదానినేర్పాటు చేయుట. ఈసంఘమువారు ఆయామార్గముల నుండి వచ్చు ఆదాయమును ప్రజాసంఖ్యను బట్టియు, వేర్వేరువస్తువుల కొనుబడిని బట్టియు వేర్వేరు సంస్థానములకును, బ్రిటిషు ఇండియా ప్రభుత్వమువారికిని పంచి యిచ్చుచుండవలెను. హిందూదేశ భావిపరివర్తనము సంయుక్తరాజ్య విధానమే యని మనము నమ్మిఏర్పాట్లు చేయవలసిన సందర్భములో స్వదేశ సంస్థానముల కొక ప్రాముఖ్యస్థాన మారాజ్య విధానమునం దీయవలసియుండును. ఆసూత్రము నంగీకరించిన వాటికికూడ తగిన ఆదాయవ్యయ మార్గముల నేర్పాటు చేయవలసియుండును. పైనసూచింపబడిన విధాన మాసందర్భములో ఉపయోగకారిగా నుండును.

---

# మందలింపు

దివాకర్ల వెంకటావధానిగారు

ఆంబుజన్మము నినుఁ బెండ్లియాడినట్టి-మగఁడు భాస్కరుఁడైనను మతి చలించి
యరమర యొకింత లేక నీవళియువకుని-జనవుచేసితి! వెంత నీచము తలంప?

ఏక్షణమునందు నీవు జన్మించినావొ?-నీమనము నూతనప్రియాన్వేషకంబు
అడ్డులేనట్టికూర్మి ని న్ననుసరించు-వతనియుండైన ననురక్తవా? కమలమ!

జననంబాది ప్రతిక్షణంబు నధి కాశం జెంది లెక్కించుచున్
నిను యాచించె మధువ్రతంబు, నళినీ! నీ వో రజోద్భిన్నవై
చని యర్పించితి గంధవాహునకు నీ సౌందర్యమున్, లోకు లే
మని నిందించెద? రెట్లు భృంగము సహింపన్ వచ్చు నీదుష్క్రియన్?

చేసెద వేమి చేసినను సిగ్గు నమూలము గ్రమ్మఁజేసి, శా
బాసు! మధువ్రతప్రణయ భారము నట్టిదె, సిగ్గులేని యీ
దాసరి తోడివారలను దాసయి తెచ్చి యమర్చు, నీరసా
భాసపు జీవనమ్ము నుతిపాత్రమె? గౌరవమున్ ఘటించునే?

పద్మినీజాతి కాంత కెవ్వండొ యొకఁడే-భర్తయని శాస్త్రనేత్తలు పల్కుచుందు
రేమి పాపమ్మొ నీవొకయింతయేని-వారకాంతా విలాసమ్ము వదలలేవు!.

పరమ నిర్మల శాంత జీవనముతోడ-ద్విజకులస్తోత్ర పాత్రమై వెలసినట్టి
తల్లికిని గల్గుకీర్తియు దగ్ధమయ్యె-నీ నికృష్ట ప్రవర్తన నియతివలన.

సిరి వసియించు నా భవన సీమ నిరంతరమంచు నెంచి సం
బరపడు చుంటివేమొ? మధుపంబులు గాలియుఁ జెంతఁ జేరి యా
వరుసగ వమ్మొనర్చునెడ భాగ్యము నిల్చునె? వెఱ్ఱిదాన వె
వ్వారు గమనింత్రు నీరసమై వచ్చినవేళల నిన్నుఁ బద్మమా.

కృష్ణమూర్తి యతండు సంగీతచతురుఁ-డనుచు నుబ్బెదవే గాని యళియువకుఁడు
నిరత మధుపాన మాసించి నిన్నుఁ బీల్చి-పిప్పిసేయఁడె యొంకుకీ వెఱ్ఱి నెనరు.

మలయపవనునియందు వ్యాకులత మాన్పి-శాంతి నిడు పురుషోత్తమాచార్యుఁ డనుచు
చెలిమి గావించు కోరిక గలిగె నేమొ?-సౌరభంబు హరించు తస్కరుఁడు గాడె?.

కా దనఁబోక వారలకె గౌరవ మిత్తువు, కామసాగరం
బీఁదెడు వారి కుండవలదే కనుమాటు రవంతమైన నో
నీ! దయితుండు కన్గొనెడి సిగ్గుదయింపదె? కాంతుఁ డెంత దా
మోదరుఁడైన నిట్టిగతి మొండితనంబు వహింపఁ బోలునే?.

సుందర మూర్తి గాఁ డనెదొ? చూచునెడన్ మిఱుమిట్లు గొల్పు నా
యందునఁ బ్రేమ లే దనెదొ? యాతఁ డొసంగిన వైభవంబె నీ
విందఱఁ జేరఁదీసి తనియింపఁగఁ గారణ మయ్యెఁ గాదొకో
సుందరి! యెంత మైమఱపుఁ జొచ్చె? నిదంతయు శాశ్వతంబొకో?

పరమ దయాతిరేకమునఁ బాపము నీ వొనరించు తప్పు భా
స్కరుఁడు సహించు; నాతని ప్రచారము గల్గిన యంతవట్టె యీ
కరణి విలాసముల్ గనుట కాలవశంబున నస్తమించినన్
మురువు నశించి యెచ్చటనొ మూలముడుంగఁగ నౌను పద్మినీ!

---

# ఔరంగజేబు: రాజప్రతినిధి

మొసలికంటి సంజీవరావుగారు

జగద్విఖ్యాతిగాంచిన మొగలాయీపాదుషాలలో నౌరంగజేబు కడపటివాఁడు. జేబరు తత్సామ్రాజ్య స్థాపన మొనరించి (౧౫౨౬), యశోవంతుఁ డాయెను. అతని పుత్రుఁడగు హుమాయూను ప్రతిభాశాలియగు షర్షాచే నోటువడి, పారసీకదేశమునకుఁ బాఱి, తన యవసానకాలమున గతరాజ్య సంపాదన మొనరింపఁ జాలెను (౧౫౫౫). అతని తనయుఁడగు నక్బరు పదమూఁడేండ్ల ప్రాయముననే రాజ్యభారము వహించి, కష్ట పరంపరల కోహటింపక తన రాజత్వము స్థిరపఱచికొని సామ్రాజ్య మత్యంతముఁ బెంపుచేసి, రాజనీతివిశారదుఁడై హైందవ ప్రజాభిమానముఁ జూఱకొని, నిర్వక్రమగు కీర్తి గాంచెను. రాజపుత్ర నారీరత్నగర్భ సంభవుఁడగు జహాంగీరు తన జనకునివలె ఘనకార్యము లొనరింపక, నిజభామినీ భుజపంజరబంధితుఁడై సుఖంబుగఁ గాలహరణ మొనరించెను. అతని కుమారుఁడగు షాజహాను సామ్రాజ్యవిస్తారకుఁడై, యపూర్వ భోగభాగ్య సమన్వితుఁడై, కళాపోషకుఁడై జగదద్భుత భవననిర్మాతయై తనరి, తుదకుఁ దనపుత్రుని కతంబుననే నిజరాజ్య స్వాతంత్ర్యములు గోల్పోయి మరణించెను (౧౬౬౬). అతని పుత్రుఁడే యౌరంగజేబు.

ఔరంగజేబు నిక్కముగ నద్వితీయుఁడు. అతఁడు జీవించినంతకాల మేపాదుషాయును జీవింపలేదు (౯౧ సంవత్సరములు). అతని ధైర్యస్థైర్యము లద్వితీయములు; బుద్ధివైశద్య మసాధారణము; ఉపాయబల మనంతము; గర్వరహిత నిరాడంబర జీవనము నిరుపమానము. అతని సామ్రాజ్యవైశాల్య మపూర్వము; అట్టి మహానీయుఁడు కఠినుఁడై, క్రూరుఁడై, నిరంకుశుఁడై, హైందవప్రజాకంటకుఁడై, సామ్రాజ్య శృంఖల శైథిల్యకర్తుఁడై, నిరంతర సంగ్రామనిమగ్నుఁడై, సర్వజనాభిమానదూరుఁడై మరణించెను (౧౭౦౭). ఆ నృపాలుఁ డేరిని విశ్వసింపక మహాసామ్రాజ్యమంతయుఁ దానే నిరంకుశముగ శాసింపుచుఁ, బ్రజాహిత సంస్కారములయెడఁ జూపవలసిన బుద్ధివైభవమును, అద్వితీయ కార్యదీక్షయును అన్యథా వినియోగించి, పలుదేశములు స్వయముగా జయించియుఁ, దుదకుఁ దనజీవితము వ్యర్థమాయెననియుఁ, దాను మరణించునంతనే తన భూరిసామ్రాజ్యము శిలాఘటిత మృద్ఘటమువలెఁ దుత్తునియలగుననియు నవసానమున గుర్తించి, విలపించి, విశీర్ణహృదయుఁడై మరణించెను.

ఔరంగజేబు స్వీయరాజ్య విధ్వంసకుఁడగుటయే గాక, ఆసేతు శీతాచలవ్యాప్తంబగు బ్రిటిషు సామ్రాజ్య స్థాపనమునకుఁగూడఁ గారణభూతుఁ డాయెను. తాదృశ మహద్విషయ గర్భితంబగు నీ సమ్రాట్టుచరిత్ర మవశ్య పఠనీయము. మొదట నీతని రాజప్రాతినిధ్య మరయుదము.

ఔరంగజేబుయొక్క రాజప్రాతినిధ్యము కడుంగడు ముఖ్యము. అతని సామ్రాజ్యభారధురంధరు నొనరింపఁజాలిన దయ్యదే. ఔరంగజేబుయొక్క జ్యేష్ఠసోదరులగు దారాషూజాలును, కనిష్ఠుఁడగు మురాదునుగూడ రాజప్రతినిధులై, సామ్రాజ్యభాగములను బాలించియుండిరి. కాని, ముందు విశదమగు కారణములచే వారియనుభవము నిరర్థకమాయెను. ఔరంగజేబు మాత్రము తన యనుభవము సార్థకపఱచుకొని, రాజ్యము వీరభోజ్యమను సూత్రమును స్థిరపఱచెను.

ఔరంగజేబు మహావీరుఁడు. పదునాలుగేండ్ల ప్రాయముననే తల్లక్షణము వ్యక్తమాయెను. పాదుషాయగు షాజహాను వినోదార్థ మొకనాఁడు యమునానదీ తీరమున మదగజములను బోరాడించెను. గజరాజములు కొంతదూరము పాఱి నడగొండలవలె డీకొనెను. తద్వినోద వీక్షణాభిరతుఁడై షాజహా నావంకకు నడరెను. రాజకుమారులు దారా షూజా యౌరంగజేబు లశ్వారూ

ధుంలై యాతని ముందఱ నడచిరి. ఔరంగజేబు అమితోత్సాహియై యామహోత్సవములను మఱచియు సమీపించెను. ఆయుధపాణులగు యోధజనులందఱు గొంతిదవ్వున నిలిచియుండిరి. బలపడిన మత్తేభములు రెండు పరస్పరము వెనుకకు మఱల, నందొకటి యాకస్మికముగ ఘీంకార మొనరింపుచుఁ గరాళమృత్యుదేవతవలె నౌరంగజేబుపై దివ్వవఁ బఱతెంచెను. పదునాలుగేండ్ల బాలుఁడగు నారాజపుత్రుఁ డొక మహానగమువలె నిలిచి దానిపై నొకశూలము విసరెను. ప్రజాసమూహము లాభీషణదృశ్యము గాంచి సంక్షోభించి పరస్పరపదఘట్టనం బొనరింపుచుఁ బాఱఁదొడఁగిరి. చెలరేఁగిన మదగజము నెదిరించి రాజనందనుని కపాయము వొరయకుండ మఱలింపవలయునని భటులు ప్రయత్నించిరి. మత్తగజ మంతమాత్రమున మెత్తఁబడక కట్టెదుటంగల వారునమును దన పెనుగేలఁ బెల్లగఁ బఱచెను. ఔరంగజేబు మెఱపువలెఁ బుడమి కుఱికి, ఖడ్గము దూసి, ఆయలికాయమున కభిముఖుఁ డాయెను. వినను, అట్టి సాహసమువలనఁ బ్రయోజన మేమి? కాని యంతలో సాహాయ్య మరుదెంచెను. అతనికంటె రెండు సంవత్సరములు పెద్దయగు షూజా జనసందోహములను జీల్చుకొని వచ్చి, తన శూలఘాతమున మదగజమును నొవ్వఁజేసెను. అశ్వ మంతలో బెదర, నాతఁడు భూపతనుఁ డాయెను: అంతట జయసింహామహారాజు లేతెంచి రేనుఁగును గారింపఁ గడఁగెను: సాయుధులగు సైనికులుగూడ రయమున రాఁదొడఁగిరి: ద్విరదము మేఘసన్నిభముగ గర్జింపుచు నటనుండి పాఱెను. షాజహాను తన తనయుని మనమలర నాలింగన మొనరించి, అతని ధైర్యసాహసములు సగర్వముగఁ గొనియాడి, బహదూరు (వీరుఁడు) అను బిరుదమును, పెక్కు బహుమానములను గూడ నాతని కొసంగెను.

ఔరంగజేబు కీర్తిమంతుఁ డగునని వాఁడే తెల్లమాయెను. కష్టతరమగు దక్కను దేశపరిపాలనమున కాతనిఁ దయారుచేయవలయునని పాదుషా యోచించి, యుద్ధానుభవ మలవడఁ జేయుట కాతని బుందేలాయుద్ధమునకు (౧౬౩౫) సేనాధ్యక్షునిగ నియమించెను. ఆతఁడాసమరమున నొనరించిన దేమియు లేదు. రంగమున కాతఁడు దవ్వున నుండెను. ఆతని నాయకత్వము నామమాత్రము. ఆరితేఱిన సేనానులే కార్యభారమువహించి, పాదుషాయధికారము ధిక్కరించిన బుందేలానాయకుని ఝుఝూరసింహునిఁ దఱిమి తఱిమి వధించి, రాణివాసమును గఱపగఁబట్టి, క్షతగాత్రయై మరణించిన రాజమహిషి నిదప్ప తక్కిన యాకోమలనారీజనంబులను మొగలాయీఁగమమహాలునకుఁ గొంపోయిరి. పరపురుషదర్శనముకంటె ఖడ్గప్రహారణమునే ప్రీతికరముగ నాకాంక్షించు క్షత్రియ మానినీమణులు దుస్సహంపు మ్లేచ్ఛమత ముపలంబించి, ప్రేమశూన్యులగు పురుషులకుఁ గామభోజ్యలై నీచతమ జీవన మొనరింప వలసిన వారైరి.[1] అత్యల్పవయస్కులగు బుందేలారాజకుమారులు మహమ్మదీయ మతావలంబన మొనరింపవలసి వచ్చెను. వైరులవాతఁ బడకుండ తప్పించుకొని పాఱి గోలుకొండ దేశమున నడంగియుండఁ దలంచిన ఉదయభానుఁ డను రాకొమరుఁడును, విశ్వాసబద్ధుఁడగు తద్రాజ్య మంత్రియును నాస్థలజ్ఞులచే షాజహానున కప్పగింపఁబడిరి. వారు స్వీయమతవిసర్జన మొనరించుటకు నిరాకరింపఁ, గ్రూరముగ వధింపఁబడిరి. తన ప్రియతనయుఁ డాహ్వానించుటచేత షాజహాను బుందేలా రాజధాని కరుదెంచి, విజయశాభిమానము వ్యక్తమగునట్లు దేవళంబులను బడఁగొట్టించి, కొన్నిటిని మసీదులుగ సంస్కరించి, అన్ని యొనరించినను కించిదభిమాన మెఱుంగక యుద్ధారంభమునుండియు నిజదేశవిధ్వంసమునకుఁ దోడ్పడిన దేవిసింగును[2] గొండొక

1. "A more terrible fate awaited the captive ladies who survived: mother and daughters of Kings, they were robbed of their religion,and forced to lead the infamous life of the Moghul harem to be the unloved playthings of their master's passion for a day or two and then doomed to sigh out their days like bondwomen, without knowing the dignity of a wife or the joy of a mother." J. N. Sarkar's Aurangazebe, Vol. 1, p. 27.

2. ఓర్ఛారాజ్యమసలు దేవిసింగునకే రావలసియుండెను. కాని, జహంగీరు వానిహక్కును గణింపక, తద్వంశీజుఁడును, తన కిష్టుఁడును నగు వీరసింగుదేవున కారాజ్యమొసంగెను. ఆతని పుత్రుఁడే ఝుఝూరసింగు.

విభాగమగు 'మర్వా' రాజ్యసింహాసనమున నిలిపి, లెక్క లేని ధనకనకవాహనంబులం గొని హసవాననుఁడై నిజ రాజధానికి మరలెను.

ఔరంగజేబుయొక్క రాజప్రాతినిధ్యము ౧౬౩౬ నందుఁ బ్రారంభమాయెను. ఆతఁడు రెండు సారులు దక్కనునందును, గుజరాతు, బాఖ (హిందూదేశమున కవ్వల మధ్యాసియా యందలి యొక దేశము), ముల్తాను దేశములందును మొత్త మిరువదిరెండు సంవత్సరములు ప్రతినిధిగ నుండెను. మూర్ధాభిషిక్తులగు భూమీశు లంత కాలము రాజ్యపాలన మొనరించుటయే సాధారణముగ దుర్ఘటము. ఇందు దక్కనునందలి రెండవప్రాతినిధ్యము ముఖ్యతమము. తద్విషయము విపులముగఁ బ్రసంగించుటకు ముం దితరవిషయములను లఘువుగఁ బరామర్శింతము.

ఔరంగజేబు పదునెనిమిదేండ్ల ప్రాయముననే దక్కను దేశమునకుఁ బ్రతినిధి యాయెను. ఈ ప్రాతినిధ్య మెనిమిదిసంవత్సరముల కాల ముండెను. ఉద్యోగ భారము వహించిన యొక సంవత్సరమునకే యాతని వివాహ మధికవైభవముగ జరిగెను. అహమ్మదునగర రాజ్యమును బూర్తిగ స్వాధీనపఱచుకొనుటతప్ప ప్రశంసనీయమగు విషయ మెద్దియు నీకాలమునసంభవముకాలేదు. అల్పభూనాథుల నొంచి యాతఁడు కప్పములను, గానుకలను గొనుచుండెను. బుందేలాయుద్ధసమయముననే యౌరంగజేబు దశసహస్రసైన్యమున కధినాథుఁ డాయెను. ఇయ్యది గౌరవప్రదమగు పదవి. ప్రతినిధియైన మఱుసటి సంవత్సరమే యాతని పదవి పండ్రెండు వేలకుఁ బెంపుచేయఁబడెను. మఱిరెండు సంవత్సరములలో నాతఁడు పదునైదువేల సైన్యమున కధీశుఁ డాయెను. అపారశక్తిసామర్థ్యములు గల యౌరంగజేబు తన జనకుఁడగు పాదుషా యభిమానమునకుఁ బాత్రుఁడై దినదినప్రవర్ధమాన గౌరవ సంకలితుఁ డగుచుండెను. కాని, అట్టివాఁ డేలాకో, యాకస్మికముగా రాజానుగ్రహము గోల్పోయి పదచ్యుతుఁ డాయెను. ఆతఁడు విరాగియై యుద్యోగత్యాగ మొనరించెనని కొందఱు భావింతురు. అటుగాక, యుద్యోగమునుండి పాదుషా తనుఁ దొలఁగించునని యెఱింగియే యాతఁ డాపదవి దొలంగెనని మఱికొందఱు తలంతురు. కాని, ఇట్టికారణము లసమంజసములు. జ్యేష్ఠపుత్రుఁడును, సదా తండ్రిచెంగటనే యుండువాఁడును నగు దారా యనూయాపరుఁడై, యౌరంగజేబుపై నభిమానము వహించియున్న షాజహానుయొక్క మనసు విఱిచె ననుట విశ్వసనీయముగఁ గాన్పించును. ఏమైనను, ఔరంగజేబు ౧౬౪౪ లో నుద్యోగరహితుఁ డాయెను.

ఆసమయమున నాతఁడు రాజధానియందే యుండెను. ఔరంగజేబటు కేతేరవలసిన యవసరము విచారింపఁదగును. పాదుషా జ్యేష్ఠపుత్రికయగు జహానారా చిరస్మరణీయురాలు. ఈమె పితృభక్తి నిక్కముగ నాదర్శప్రాయము. 'తాజమహాలు' నామధేయయగు తనజనని జీవనముఁ బాసినదాది యీకన్నియ పితృసేవాపరాయణయై యాతని శోకలోపము రానీక సర్వవిధముల నరయఁ దొడఁగెను. తుదకు నాహతభాగ్యుఁడు సువర్ణపంజరాంతర శుకరాజమువలెఁ దన యంతిపురంబునఁ గుందవలసిన సమయమునఁగూడ నాతని వీడక, ఆదయాస్వరూపిణి తన వృద్ధజనకుని కష్టములందుఁ బాల్గొని, ఆతని చరమదశ సాధ్యమగుతీరున సుకర మొనరింపఁ బ్రయత్నించెను. ఆయమ పితృభక్తియే గాక, బంధుపోషణము, దీనజనరక్షణముగూడఁ బ్రసిద్ధములు. జహానారా ప్రేమ నిర్వక్రము, సముద్రమువలె ననంతము, కేవలము నిరుపమానమని వక్కాణించుట కొక యుదాహరణ మీయఁదగును. భ్రాతృరుధిరార్ణవ మీఁది వృద్ధజనకుని రెక్కలు విఱిచిన యౌరంగజేబుపైనైన నామె దీర్ఘక్రోధము వహింపక, తాను క్షమించి, తనజనకుని గూడ క్షమింపఁజేసెను. జహానారా యొకనాఁడు దుర్గముననే తన మందిరమున కరుదెంచుచుండ, విధివశమున నామె చేలఁగు దీపమంటుకొనెను. పరిచారికలు వెనువెంటనే యున్నను, సుగంధబంధురమగు నామె మేల్దుకూలము భగ్గున మండెను. ఆజ్వాలజ్వాలామాలికాపరివృతయగు తమదేవిని ఆలింగనమొనరించి రక్షింపఁగడఁగిన చెలులు బాధ నొందిరే గాని తదుపద్రవము మఱల్పఁజాలక

పోయిరి. తను సాహాయ్య మరుదెంచునప్పటికి ఆకోమలాంగి వెన్ను, ప్రక్కలు, భుజములును గాలిపోయెను. ఆదుర్వార్త తెలిసినంతనే యౌరంగజేబు సంక్షుభితమనస్కుఁడై నిజసోదరీసందర్శన మొనరింప రాజధాని కరుదెంచెను. అరుదెంచిన యొక మాసములోపుననే ఆతఁడు పదచ్యుతుఁ డాయెను.

జహానారాయుపస్థఁ బ్రతికించి యనంతర మౌరంగజేబు చరిత్ర నారయుదము. ప్రసిద్ధులగు రాజవైద్యులు తమ శక్తికొలఁది పాటుపడిరి. చక్రవర్తి లెక్కలేని దానధర్మములు చేయించెను. పాదుషా బాష్పజలార్ద్రీనయనుఁడై, వినమ్రుఁడై, ముకుళితహస్తుఁడై, యనుదినముఁ జాలకాలము మోఁకరించి దైవమును బ్రార్థించెను. కాని, దైవప్రార్థనమును దానధర్మములు, భిషగ్వరుల కౌశలముంగూడ నిరర్థకమాయెను. నాలుగుమాసముల పర్యంత మాహేమగాత్రి మరణవేదనాకరబద్ధయై యుండెను. అంతట వైద్యవిద్యాపరిచయ మెఱుంగని బానిస యొకఁడు దైవవశమున నొక లేపనముఁ బ్రయోగింపఁ బాదుషానందన బాగుపడెను. షాజహాను సంతోషమునకు మేర లేదు. తానే గాక సామ్రాజ్యమంతయు నానందమగ్న మగునట్లు లాతఁ డొకమహోత్సవము సలిపి రాజోద్యోగులందఱకు బహుమానము లొసంగెను. పేదలు ధర్మములు వడసిరి. మృత్యుంజయ యగు జహానారాకుఁ బదిలక్షలు విలువచేయు నపూర్వాభరణములను జనకుఁ డొసంగెను. అన్నిటికంటె మనవ్యాసమునకు సంబంధించు మహద్విషయ మేదియన, జహానారా భ్రాతృహితాభిలాషిణియై తన జనకు నర్థింపఁ, బదచ్యుతుఁడైన యౌరంగజేబునకు మరల నుద్యోగభాగ్యము సగౌరవముగఁ బ్రాపించెను.

ఔరంగజేబు మఱుసటి సంవత్సరము (౧౬౪౫) గుజరాతు దేశమునకు రాజప్రతినిధిగ నియోగింపఁబడెను. ఆతఁ డట నుండినది రెండుసంవత్సరములే యైనను, రాజశాసన మెఱుంగక మెఱపులై యుండు నాప్రజాళిని నొక్కి, పరిపాలనాదక్షుఁడని ఖ్యాతిగాంచెను. షాజహాను సంతుష్టాంతరంగుఁడై యాతని వేతనము విరివిగ హెచ్చించుటయే గాక, కష్టతరమగు 'బాఖు' యుద్ధమున కాతని నాయకు నొనరించెను (౧౬౪౬). బాఖు దేశము భరతఖండమున కవ్వల మధ్యాసియా యందున్నదని వెనుకఁ జెప్పియుంటిమి. ఆదండయాత్ర పాదుషా యేల తలపెట్టెనో స్పష్టముగఁ దెలియదు. మొగలాయీ రాష్ట్రమను నాఫ్గనుస్థానమున కుత్తరముగనున్న యీ దేశము సారవంతమైనది కాదు. దేశమునందలి చాల భాగము పర్వతమయమై, దారిద్ర్యనిలయమై, యల్పజనావాసమై, యనాకర్షణీయమై, హేయముగ నుండెను. కాని, అయ్యది ప్రథమ మొగలాయీసార్వభౌముఁడగు బాబరునకుఁ జెందియుండెను. అది యొక కారణము గానోపును. లేదా, కేవలము జిగీషయే కావలయును. ఏమైనను, అది యొక యత్యాశాప్రయత్నమని పర్యవసానమునఁ దెల్లమాయెను. తనయుం డావంతయు లోపము లేకుండ నౌరంగజేబు సమరకార్యము శ్లాఘాపాత్రముగ నిర్వర్తించెను. ఆతనికిమాత్రమే దగు చేంటి గాంభీర్య మొకయెడఁ బ్రదర్శించి యౌరంగజేబు శాత్రవనృపాలుని సహితము బ్రాన్పడఁజేసెను. యుద్ధ మతి తీక్ష్ణముగ నుండెను: ఇరుబలంబులును హోరాహోరి పోరాడుచుండెను; అంతలో సాయంసమయ ప్రార్థనావసర మరుదెంచెను. తన యుద్యోగులు భయవిహ్వలులై వలదని వారించినను వినక, తనుత్రాణరహితుఁడగు నాధీరుఁడు తనరేనుఁగు డిగ్గి, తివాచిఁ బఱచి, మోఁకరించి, ఘోరతరయుద్ధ మదెట్టులనో జరుగుచుండినట్లు, నిశ్చలచిత్తుఁడై, దైవచింతానిమగ్నుఁడై, తదనుష్ఠానము యథావిధంబున నొనరించెను! వైరు లావిపరీతదృశ్యము గాంచి హాహాకారము లొనరించిరి. అట్టి వ్యక్తితోఁ బోరాడుట యాత్మవినాశకరమని తత్సేనాధిపుఁడు యుద్ధ మాఁపుచేయించెను. కాని యీ రణమువలన హైందవ ప్రభుత్వమునకు నాలుగుకోట్ల రూపాయిలు ఖర్చాయెను, ప్రతిఫలము మాత్రము శూన్యము. రణరంగమున నైదువందల మందియును, మంచువలనఁ దాళఁజాలక నైదువేల మందియును తెగటాఱిరి. మనదేశపు బశ్చిమోత్తర పరగణాలు దాఁటి యన్యదేశాక్రమణ మొనరింపఁగడంగు

సామ్రాజ్య తత్త్వ మిట్టులే దారుణముగ సంకట పడును.*

బాఖు యుద్ధానంతర మౌరంగజేబు ముల్తాను దేశమునకుఁ బాలకుఁడాయెను (౧౬౪౮). మఱుసటి సంవత్సరము సింధు దేశముగూడ నాతనిచేతికి వచ్చెను. వన్యమృగములవలె విచ్చలవిడిఁ జరించు నచ్చటి 'యాఫ్ఘను' 'బెలూచీ' జాతులను లోఁబఱచుకొనుట కష్టతమము. ఔరంగజేబు సముచితకాఠిన్యము వహించి కొంతవఱకుఁ గృతకృత్యుఁ డాయెను. దేశమునందలి వర్తక మభివృద్ధి పఱుప నెంచి, సింధునదీముఖమున నాతఁ డొక నౌకాశ్రయము నిర్మించెను. కాని యీ ప్రాతినిధ్యము నాలుగు సంవత్సరము లున్నను, రెండుసారు లాతఁడు దేశము వీడి కాందహారు ముట్టడింపవలసినవాఁ డగుటచేత నా పరిపాలనము రాణించుట కవకాశము లేకుండెను. ఒక్క సంగతి తలంపవలయును. తనకు వచ్చు వేతనమును. ఇతర రాఁబడులను ఖర్చులవలె నాతఁడు నిక్షేపింపక యధికతర సైన్యవ్యయమునకు వినియోగించెను. కాని యిందువలన నొక నష్టము వాటిల్లెను. ఒకపు డాతఁడు ధనము చాలక తన జనకు నర్థింప, నాతఁడు కుపితుఁడై విముఖుఁ డాయెను. ఐనను, షాజహా నాతని చాకచక్యము నెఱింగినవాఁ డగుటచేతఁ 'గాందహారు' ముట్టడి కాతనినే నియోగించెను.

కాందహారుదుర్గమును మొగలులు మూఁడుసారులు ముట్టడించిరి. రెండుసారు లౌరంగజేబును, మూఁడవసారి యువరాజగు దారాయును సేనాధిపత్యము వహించిరి. ఇట్టి బృహత్ప్రయత్నము లొనరింపవలసిన యవసర మొదవించిన కాందహారు సంపాదన మత్యంతావశ్యకమై యుండవలయును. పెరసియా యాఫ్ఘనుస్థాన దేశముల కయ్యది నడుమ నున్నది. ఆదుర్గము తన యధీనమున నున్నఁగాని యాఫ్ఘనుస్థానమునకు క్షేమము లేదు. మఱియుఁ బెరసియా దేశమునుండియు, మధ్యాసియా దేశములనుండియు హిందూదేశముపై దండెత్తు భయంకరవైరులు కాందహారు మీఁదుగనే రావలయును. ఆదేశ మాతీరున స్థలప్రాముఖ్య సమన్విత మగుటయే గాక, ప్రసిద్ధవాణిజ్యపథంబై, ధన సమృద్ధమై, సారవంతమై, శోభాయమానమై, యెంతయు నాకర్షణీయముగ నుండెను.

అట్టి కాందహారు చిరకాలమునుండియు మొగలాయీ పెరసియా రాజ్యములకు పరస్పరముఁ బ్రాయికముగా మాఱుచుండెను. షాజహాను రాజ్యారూఢుఁ డగునప్పు డయ్యది పారసీకహస్తగతమై యుండెను. కాని, ఆ దేశముఁ బాలించు పారసీక సేనాని యేలాకో, తన కేమిఁ దలంచి భీతిల్లి, తదపాయవిమోచనమున కొక్కటియే యుపాయ మని యెంచి, తనయధీనమున నున్న దుర్గమును మొగలులకప్పగించెను (౧౬౩౮). షాజహాను పరమానందభరితుఁడై వాని కత్యున్నతపదవి నొసంగి విశేషముగ గౌరవించెను. అసలే కడు బలవంతమగు నాదుర్గమును బాదుషా యింకను దృఢపఱచి యభేద్యముగ నొనరించెను. కాని, పోయిన దుర్గము మగుడ సంపాదింపవలయునని పారసీకులు సంకల్పించి, సముచితసన్నాహము లొనరించుకొని, ౧౬౪౯లో నావంక బయల్వెడలిరి. వారి ప్రయత్నములగుఱించి షాజహానునకు ముందుగనే తెలియవచ్చెను. ఐన నాతఁడు మందబుద్ధియై దుర్మంత్రము లాలించి, దుర్గరక్షణార్థము వలయు సైన్యములు సకాలమునఁ బంపకపోయెను. అసమర్థుఁడగు నా దుర్గపాలకుఁడు వైరివాహినీసమూహములఁ గాంచి భయభ్రాంతుఁడై, యొక్క లక్షసైన్యమునైనను దృణీకరింపఁజాలు నా మేటికోటను వైరులకప్పగించెను. అట్టి ఘోరము సంభవించునని ఔరంగజే బెఱుంగఁడు. తమ దుర్గమును ముట్టడించిన శత్రువులను వెక్కడుటకు మాత్రమే యాతఁ డాయత్తపడి యరుదెంచెను. శాత్రవాధీనమైన యదుత్తమ దుర్గమును ముట్టడించుటకు వలయు శతఘ్ను లాతనివద్ద లేవు. కావున, నా వీరుఁడు భగ్నమనోరథుఁడై వెనుదిరుగవలసినవాఁ డాయెను.

కాని, శత్రుసంహార మొనరించి యాదుర్గము స్వాధీనపఱచుకొనినఁ గాని తన గౌరవము పునఃప్రతిష్ఠితము కానేరదని యెంచి, షాజహాను భూరితరప్రయత్నము లొనరించెను. అనంతర మాతఁ డౌరంగజేబు నొక్క

* "Such is the terrible price which aggressive Imperialism makes India pay for wars across the north-western frontier."
J. N. Sarkar.

నిచే గాక, తన ప్రధానమంత్రియగు పాదుల్లాఖానునుగూడ సేనాధ్యక్షునిగ నియమించెను. వెంగలాయా సైన్యము లవంత బలసమన్వితములయి, దృఢశిక్షితదళసాహాయ్యములై, విజయోత్సాహములై, దురాసదదుర్గాక్రమణాయత్తములై ముసుడ దాడివెడలెను. కాని, విజయ మీసారియును జేకూరకపోయెను. ఔరంగజేబు మాత్రమందులకు బాధ్యుఁడు గాఁడని గ్రహింపఁదగును. అతనితోడి సేనాధ్యక్షుఁడగు ఖానుఁడే సర్వసేనాధిపతియై యుండెను. పాదుషా యూతనినే విశ్వసించెను. అతని యనుమతి లేకుండ యౌరంగజేబేమి చేయుటకును అవకాశము లేకుండెను. అనేకదినము స్వచ్ఛందముగఁ జరింపఁజాలక, కాబూలునందు విడిసియుండిన పాదుషాయాజ్ఞల కెదురుచూడవలసినవాఁ డాయెను. మఱియు, పారసీకుల దండాశలకు శ్రేష్ఠము. వెంగలాయా శిక్షితదళము వందుఁ బాశ్చాత్యులుగూడ నున్నను, అయ్యవి కాత్రన శిక్షణాలయముందు నిరాపముగ నుండెను. ఇట్టి కారణము చేతఁ గాండహారదుర్గాక్రమణము వెంగలుల కసాధ్యమాయెను. మఱునటి సంవత్సరము యూసరా జను దారా సగర్వముగ సర్వసేనానాయకత్వము వహించి, తన జనకుఁడు సంతోషించునట్లు మహత్తరసైన్యసమన్వితుఁడై గంభీరముగ బయలుదేఱి, తుదకు గలగర్వ యుత్సాహముడై వెనుదిరిగెను.

లాభ మణుమాత్రము లేని యీయాగమునకు దాదులకును పండ్రెండుకోట్ల రూప్యములు ఖర్చాయెను. కాని, ప్రజాభిప్రాయ మఱయక కేవలము నిరంకుశముగఁ జరింపు ప్రభుత్వ మేమి యొనరించినను చెల్లునుగదా.

వెంగలాయా ప్రతిష్ఠ భగ్నమాయెను. పా నిష్కారణముగ నౌరంగజేబుపైఁ గోపించి, వానిని దక్కనుదేశపాలకత్వమునకు నియోగించెను.

---

## నిరాశా విరాగము

అల్లంరాజు రంగనాయకులు గార

నీవిసీల విలోల నేత్రాబ్జయుగములో
 సురభికౌముది మెరసి సోనలై వానలై
కురిసి మధుధారలై విరిసి ప్రవహించి, నా
శిథిల హృదయముఁ జొచ్చి చివురెత్తఁ జేసి, విరి
యించి వెలయించి కల లెన్నొ నిగాయించె;
శారదోజ్జ్వల పూర్ణిమారమణివో, చైత్ర
శృంగారతను వల్లరివో, యుషఃకాంతవో,
తరళప్రవాళ సంధ్యామనోరమ వేమొ?—

సంతత విషాదతప్త వాసంతికాంత
రంగమిది; గ్రీష్మదాహాన రగిలిరగిలి
మంటలెగయు నెడారి; ఇమ్మానసమున
మోదపూర్ణామృతభరమ్ము మోయలేను:
ప్రణయమయమూర్తి! నీమధుర ప్రశాంత
మోహనాలోకనముల, నామోడుటెడఁద
నుండి మరలించుకొని నన్ను ఖండ వేద
నా విభీతాగ్నిలో వ్రేఁగిపోవనిమ్ము!!!

---